"యశస్వీ"

# వినోద సాహిత్య వైచిత్ర్యాలు

(ప్రథమ భాగము)



ఆఖ్యాత, వ్యాఖ్యాత :

"సాహిత్యరత్న" సూరపనేని వేణుగోపాలరావు,

సాహిత్య విద్యాప్రవీణ, భాషాప్రవీణ, T.C.P.T., M.A., P.O.L.,

రిటైర్డ్ సంస్కృతాంధ్రాధ్యాపకులు,

అక్కినేని నాగేశ్వరరావు కళాశాల, గుడివాడ - 521 301.



ప్రచురణ :

"ఆనందవర్ధన" ప్రచురణలు

40-9/10—12

మునిసిపల్ కాలనీ, వెంకటేశ్వరపురం-P.O.

విజయవాడ - 520 010.

"ఆనందవర్ధన" చతుర్థ ప్రచురణ, 1997
"వినోద సాహిత్య వైచిత్ర్యాలు"
(Vinoda Saahitya Vaicitryaalu)

ఆఖ్యాత, వ్యాఖ్యాత :
'సాహిత్యరత్న' సూరపనేని వేణుగోపాలరావు, "యశస్వి"

ప్రథమ ముద్రణ : 1997, 1000 ప్రతులు



వెల : రు. 25-00

ప్రతులకు :
శ్రీమతి సూరపనేని కాస్తూరత్నమ్, "ఆనందవర్ధన ప్రచురణలు",
40-9/10-12, మునిసిపల్‌కాలనీ, వెంకటేశ్వరపురం-P.O.
విజయవాడ - 520 010.

ముద్రణ :
వంశీకృష్ణా ప్రింటర్స్
విజయవాడ-2.

# మున్నుడి

## గ్రంథ రచనా సముద్దేశ వివరణము.

రస భావబంధురాలైన 'ఆశు, మధుర, చిత్ర, విస్తరములను ఛందోబద్ధ చతుర్విధాలు కవితకు విశేషణాలుగా కాక, 'కవిత్వాలు'గానే, నన్నయ్య నాటినుండీ ప్రసిద్ధాలు. ఈ చాతుర్విధ్యంలో మతభేదాలు కూడ లేకపోలేదు. ఈ చాతుర్విధ్యంలోని రెండింటిలో,ఆశు కవిత్వానిదే అగ్ర తాంబూలం. వానిలో వైవిధ్యం, వైచిత్ర్యంకూడ వెల్లువైపారింది.

వినోదాన్ని గర్భీకరించుకొని, విజ్ఞానాన్ని అందించే 'చాటువు'ల ఆవిర్భావానికి, ఆధారాలు, మూలాలు కూడ ఆశుకవితలే, సంస్కృతాంధ్ర కవులెందరో ఈ 'చాటువు'లను ఎన్నోవిధాల నిర్వచించారు. వాటి నన్నిటినీ సంగ్రహిస్తే, 'మధుర, మనోజ్ఞ, ప్రశస్త, దీప్తిమత్, ఉల్లాస కర, చమత్కార....ఆది భావాలతో, హార్దంగా, సరదాగా, చెప్పిన,ప్రియ మైన లేక ఇచ్చకపు-మాట—అనవచ్చునంటారు-అది అప్పటికప్పుడు, అల వోకగా, అప్రయత్నంగా, ఆశువుగా, భవ్యకవితావేశంతో కవినోటినుండి బహిర్గతమై, జాలువారిన ఆపాత మధుర-అమృతధార.

అది, అన్య పద్య సంబంధాన్ని అపేక్షింపని 'ముక్తక'మైనా, చెప్పదలచిన భావాన్ని, సహృదయరంజకంగా ప్రతిపాదిస్తూ, మళ్ళీ మళ్ళీ చదవాలనీ, వినాలనీ, అనిపింపజేస్తుంది. పదుగురి నోళ్ళలోపడి, పల్కరిస్తూ, పరవళ్ళు తొక్కిస్తుంది. సరిగా అర్థం కాకపోయినా,శ్రద్ధగా, 2, 3 సార్లు చదివినంతనే కంఠస్థమైనట్లుంటుంది. "చాటు పద్యమిలను చాలదా ఒక్కటి" అన్న విశ్వదాభిరాముడగు వేమన్న వేదాన్ని వెల్లడిస్తుంది.

వినోదాన్ని (వేడుకను)కాదనే వారెవరుంటారు? అది మానవునికి దైవదత్తమయిన వరం. అసలా వినోదం మానవులకేకాదు, కావ్యశాస్త్ర 'వినోదేన'-పండితులకు, దేవతలకు కూడ కావాలట! కనుకనే 'వినోద ప్రియా హ వై దేవాః' అను సూక్తి వచ్చింది. అలనాటి 'సాహిత్యార్థ'మే మారి, నేడు వైవిధ్య, వైచిత్ర్య, సౌలభ్యాలను సంతరించుకొంటోంది. పాతకొత్తల మేలికలయికను కాంక్షిస్తోంది. ఈ 'వినోద సాహిత్య వైచిత్ర్య' ప్రయోగం, దాన్ని చూపు ప్రయత్నమే.

చారుచందన చర్చితాలైన చాల చాటువులు సులభ, ద్రాక్షాపాకంలో

ఉన్నా, కొన్ని పండితులను కూడ, పట్టిపల్లార్చే, పాషాణ పద్యాలుగాకూడ లేకపోలేదు. తెలుగు చాటువులన్నీ సంస్కృత ప్రహేలికలు కాజాలవు.

ఈ 'చాటువు'లోని 'చ'కారం, తాలవ్యం, దంత్యంగా కూడ ఉచ్చరింపబడుతోంది. వస్తుతః, సంస్కృత ప్రకృతి 'చాటుః' యొక్క, వికృతి రూపమే 'చాటువు' గనుక, అది తప్పకుండా తాలవ్య చకారమే. కాగా, కొందరు దంత్య 'చాటువు'గా భావించి, దాని కర్థం 'మరుగు' అన్నారు. దాన్నే పూర్తిగా అంగీకరిస్తే, చివరికవి 'చాటు పద్యాలు'గానే కాక, 'చేటు పద్యాలు'గా అవుతాయి. సూర్యోదయాదులు కొన్ని ఎల్లప్పుడూ నిత్యనూతనాలుగానే అలరిస్తున్నాయి.

అసలు, కవి సృష్టికీ బ్రహ్మసృష్టికీ అంతరం, మహదంతరం. సత్కవీంద్రుల కవితామృతధారలు, తీరుతీయములు, ఇంపు సొంపులు, భాషా సాహిత్య ప్రవాహంలో, ప్రాచీనకాలంనుండి, కావ్యప్రబంధ రూపాలలోనేగాక, చాటు పద్యరూపంలోకూడ, చమత్కారాన్ని చక్కగా, చిక్కగా, రంగరించుకొని, జాలు వార్చుతూ వస్తున్నాయి. వాస్తవానికి, తెలుగులో చాటు కవిత ఒక విలక్షణ ప్రక్రియ. దాని చరిత్రకూడ తెలుగుజాతి అంత ప్రాచీనం, ఈ చాటువుల్నీ, చాటుకవుల్నీ అంటిపెట్టుకొని, జనశ్రుతిలో అంతులేనన్ని కథలు, గాథలు, సందిగ్ధ-గ్రంథ గ్రంథులు, వాదాలుకూడ, వన్నెకెక్కి ఉన్నాయి. వానిలోని శిల్పాది విశేషాలను శాస్త్రీయ దృక్పథంతో, పర్యాప్తంగా పరిశోధించి, ప్రవిభాగపురస్సరంగా వర్గీకరించి, సోదాహరణంగా ప్రదర్శించాలంటే, లక్షలు చాలవు, కోట్లు కావాలి. ఆ పని ప్రభుత్వం, ప్రజాహిత సంస్థలు, అకాడమీలకే సాధ్యం.

మౌఖిక సంప్రదాయ సంబద్ధాలై, వ్యావహారిక భాషలో ఉన్న చాటువులెన్నో పల్లెల్లో, 'చాటవలు'గా, సామెతలుగా ఆమెతలనందిస్తూ ఉన్నాయి. అసలు 'పల్లెటూరు'ను పరిశీలిస్తే, పల్లెవారిది, ఊరు పీరిది. మధ్యలోని 'టు' కవిది. కనుకనే, కవుల కవనం ప్రాచీన-పల్లెల్లోనే పెరిగి, పట్టణాల దాకా పాకిందనాలి. చాటు సంకలనకర్తలెందరో, మ్యూజియంలలో అజ, గజ, రామబాణ (చెదలు) భక్షితాలుకాగా, మిగిలి మరుగునపడిన, విస్మృతాంధ్ర

కవుల, శిష్ట—పద్యరత్నాలనెన్నిటినో, ఎంతో వ్యయప్రయాసల కోర్చి, ప్రకటించిన,వారి ఆంధ్ర భాషాయోషావరివస్య(సేవ) వర్ణింపనలవి కానిది.

అట్టి సంకలనాలలో ఆద్యాలుగా ఆదరింపదగినవి, మాన్య శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రిగారి, 'చాటు పద్యమణి మంజరులు, తర్వాత దీపాల,రంగాచార్య, శ్రీనివాసాచార్య-రజనీకాంతరాయ, ప్రొ. జి. లలితల రచనలు, చెళ్ళపిళ్ళ కథలు, గాథలు, రాయలసీమ రత్నరాశి, మంగిపూడి వారి, 'చమత్కార చంద్రిక,' మొ. నవి. ఇంకా 'భారతి ఆం.సా.పరిష త్పత్రిక, గృహలక్ష్మి, మొ.పత్రికలలోను,గురజాడ, కందుకూరి-'కవిజీవి తాల'లో కూడ కొన్ని ప్రకటింపబడ్డాయి. అట్టి మాన్యుల సంకలనాల, రచ నలనుండి కూడ కొన్ని పద్యాలు గ్రహించి నందుకు, వారందరికి కృత జ్ఞతాంజలులు. కొన్ని పద్యాలు,2,3 సంకలనాలలో ఉండటంతోను,ఆకరం సరిగాలేకపోవడంతోను,మేముకూడా ఆకరాలను సరిగా ఇవ్వలేకపోయినం దుకు విచారిస్తున్నాము.

అయితే, వారిలో చాలమంది, వందలు, వేలు మూల పద్యాలను, ప్రకటించి, వాని పరువును వదిలి పరిచారు గాని, ఆ పద్యాలను, ఎవరు, ఎప్పుడు, ఎక్కడ, ఏ సందర్భంలో, ఎవరిని లేక దేనిని గూర్చి, ఏ రీతిలో ఎలా చెప్పుకు పోయారో, ఆ విషయం మాత్రం, సరిగా, అందించక పోవ టం, పాఠకులకు అత్యంతము బాధను, విచారాన్ని కూడ కల్గిస్తోంది. కొం దరిచ్చిన 'టిప్పిక, లఘుటీక'లు, సామాన్యులగు లాతివారి లాఘవాన్ని లంఘింప లేక పోతున్నాయి. ఆనాటివారి కవి అర్థమై, ఆనందాన్నందించి ఉండవచ్చు. నానాటికి తీసికట్టుగా నున్న నేటి తరంవారికి, అనుగుణంగా ప్రచురణకర్తలు పునర్ముద్రణ సందర్భాలలోనైన, కనీసం కఠిన పదార్థ తాత్పర్యాలను ప్రకటింపలేదు. నిజంగా, వారట్లు చేసి, ధరపెంచినా, పామ రులు కూడ కొని, కనీసం నూరు పద్యాలైనా కంఠస్థం చేసుకొని 'శతశ్లో కేన పండితః అని, 'పండితం మన్య'లని పించుకొనేవారు, తర్వాత, ఆ ఆనందంతో, అంతకన్నా ఎక్కువగా చదివి, 'శతశ్లోకే-న- పండితః' (నూరుశ్లోకాలు నేర్చినంత మాత్రాన పండితులుకా జాలరు) అను పరమా ర్థంతోక ఇతోధికంగా చదివి, 'పండిత మాన్యులు'గా కూడ అయ్యేవారు. ఆంధ్రుడైయుండి కూడ "నాకు తెలుగురాదు, తెలుగులో మాట్లాడ

లేను, ఇంగ్లీషులో మాట్లాడుతా"ననడంతో,తెలుగు మొదలార్పుకుపోతోంది. ఎన్నికలయ్యేంత వరకు 'ఆంధ్రాన్ని ఉద్ధరిస్తాం, అందలానికి ఎక్కిస్తాం' అని, గొప్పగా డప్పువాయించినవారు,తర్వాత ఆ ఊసు ఎత్తితే ఒట్టు.

ఒకనాటి ఆంధ్రాస్థాన కవీంద్రులు చెళ్ళపిళ్ళవారు "తెలుగు తెలుగవి అర్థాన దిగుచెకావి, సంస్కృతము కన్న దాన కష్టంబుహెచ్చు"అని హెచ్చరింపగా, వి.స. గారు"తొలినాళుల పద్యార్థముతెలియనిచో,-'పాఠకునిది తెలియమి', 'ఈనాళుల కవి దోషము..'అని విసుగుతో విసరిన సంగతిని విన్న, పట్టించుకొన్న-వారెవరు? కావ్యాలనలా వదలండి. కనీసం చాటు పద్యాలు కాకపోయినా, సులభ శతకపద్యాలైనా, ఎంత మందికి అర్థమౌతున్నాయో ఆలోచిస్తే, తత్త్వం మీకే బోధపడుతుందని మా మనవి.

ఇలా ఉన్నవానినే అర్థం చేసుకోలేని ఊరజోగులు (సన్నాసులు) ఉమ్మలం (దుఃఖం) గల్గిస్తూ, ఉంటే, విపరీతార్థాలుటిస్తూ, 'కాదేదీ కవిత కనర్హం, కవితా మయమేనోయ్ అన్నీ, 'దేవునాన ముమ్మ దేశానికొక కవి' ఉండగా, అంతా కవులముగామా? అంతింతో కవన మల్లగలేమా? అంటూనే 'దీని భావమేమి? "తిరుమలేశ!" అని క్రొశ్చెన్ (ప్రశ్న+కొశ్చెన్?)లు విసురుతున్నారు. వారికి'అక్షరంబు లోకరక్షకంబు, పెద్దల మేలెరుగని నరుడెద్దే, మూఢుండెరుగునె సత్కవి గూఢోక్తుల సారమెల్ల?....." అంటే సరిపోతుందా? వానిలోని 'సారాసారసారాంశాల'నైనా (సార + అసార+స్థిరాంశములు "సారాయి"కాదు) సంగ్రహించి, చెప్పాలా వద్దా? సహృదయులగు మీరే చెప్పండి!

ఆ చాటుకవుల కొన్ని విసుర్లకు ప్రత్యుత్తరింప ప్రయత్నించండి.

1. మగముండకు మీనమేల ? 2. ముండనుంచుకొన్నవాడు బ్రహ్మచారి
3. చావు పెళ్ళొక్క సమయమయ్యె జరుగునపుడు!
4. గాడిద! నీవునుం కవివి కావుగదా! 5. నడవక నడిచే వచ్చితి
6. కన్నా నా లంజెకొడుకులు కవులుగాగ, 7. నలుగురు విను బలి కిరి
8. తెలివిలేనివాడు చేవుడెట్లాయెరా?
9. ఈ తికమకలేల?-తెల్పగరాదె నిజంబునీశ్వరా!
10. నీ శూద్ర ప్రజ్ఞలు విప్రసత్కవి వచస్స్ఫూర్తిన్ విడంబించునే!
11. పందే నా కిష్ట మనుచు బాపడు పలికెన్

12. అన్నిటికి ఒక్క అక్షరంబు_త్తరంబు
13. కులాభిమానమొక చిన్నము లేదటరా! ప్రజాపతీ!
14. చెవులు రెండునాకి రెంపనూకు 15. కొండనుండునెమలి కోరినపాలిచ్చు!

ఇత్యాదిగా ప్రశ్నిస్తే ఏమిటీ అసభ్య, సంకర, వంకర, బూతుకతల నడమా? వంపు. మీరలా కాగూడదు. తెలుగు తెలిసిన, తెలుగు మీరిన, 'తెలుంగు వెలుంగు బిడ్డలు' మీరు. మీకోసం ప్రకటించిన, ఈ 'వినోద సాహిత్య వై చిత్రాలు' వంటి గ్రంథాలెన్నో తెలుసుకోడానికి ఉన్నాయి.

ఇదివరకెన్నడూ చూడని, విననివి, అర్థంకాని అయఃపిండాలవంటి కొన్ని చాటువులు సందిగ్ధార్థాలను, గ్రంథ గ్రంథులను పాఠకులపైకి విసరి, వారి మెదడుకు మేతనందించి, తెలివితేటలకు సానపట్టి,ఆలోచనాలోచనాలను తెరిపించి, వారి శబ్దాధికారాన్ని, పరీక్షిస్తున్నాయి

పూర్వం ఉపన్యాసాలలో, సంభాషణలలో, ఈ చాటుపద్యాల నుట్టంకించి, విశిష్టార్థ చమత్కారాలతో, శ్రోతల నుగ్రూతలూగించిన, జంగమ విజ్ఞాన సర్వస్వాలైన పండితప్రకాండులు, ఉండేవారు. వారు వానినన్నింటినీ గ్రంథస్థం చేయక, ఆర్థి కాధి వ్యాధి బాధలతో అస్తమించారు. నేడట్టి ప్రకర్షగల పండితులేరి? నానాటికి తీసి కట్టు కావటంతో, నేడు కొరకరాని కొయ్యలైన చాటువులను గురించి కొందరు మమ్ము ప్రశ్నించడం, యథాశక్తి వానికి ప్రత్యుత్తరించడం కూడ, అప్పుడప్పుడు జరుగుతూ ఉండేది.

కావ్యజ్ఞ శిక్షయాభ్యాసంతో, లోక శాస్త్రాద్యవేక్షణ, గురుశుశ్రూషలు చేసి, అయిదు దశాబ్దాలకు పైగా,అధీతి బోధా చరణ ప్రచారణలుచేసి, ఉద్యోగవిరమణానంతరం, నిర్మలంగా, పోతనజీవితం గడపాలనుకొన్నా, గడించిన అనుభవసారాన్ని, అందరికీ అందింపకపోతే, 'కా పురుష'ల మవుతామను భయం పీడింప, తాత్కాలిక 'గౌరవాధ్యాపకత్వ పదవి కికూడ స్వస్తిచెప్పి, సంస్కృత చారు చిత్రాలంకార చమత్కార విశేషాలను, ఆంధ్రాంగ్లహిందీ....ఆది భాషలతో, తులనాత్మకంగ పరిశోధిస్తున్న స్థితిలో, మాశిష్య,మిత్ర,హితైషి,సాహిత్య బంధువర్గం,మాపైనసహింపరాని,ఆరోపణ పాషాణాలనుకూడా, విసిరింది."మహాశయా! మీరు కొంతకాలం సంస్కృత గీర్వాణాలను సంధించటం ఆపండి. రానుతాను మాకసలు తెలుగు పద్యాలే అర్థంకావటంలేదు. కొన్ని చాటుపద్యాలు కంఠస్థాలౌతున్నాయిగాని, అర్థం

కావటంలేదు. కనీసం సులభ శతకపద్యాలు కూడా అర్థంగాని పరిస్థితులేర్పడుతున్నాయి. వానిలోని చమత్కారవిశేషాలనన్నీ ఒకచోచేర్చి, విశదీకరించండని ఒత్తిడితెచ్చి, పట్టుబట్టారు. అడిగినంత సులభమా ప్రత్యుత్తరింపడము! సమయమేది? సప్తతి-అశీతి (70-80) సంవత్సరాల మధ్యవయస్సులో, బుద్ధి మందగించి, మరపు పెరిగి, చూపువాడి తగ్గి, వేడి పుట్టించి, సాంసారిక, ఆరోగ్య, ఆర్థిక....అధిబాధలు,సతతము హతం చేస్తూవుంటే, ఎప్పుడో, ప్రౌఢ నిర్భరవయః పరిపాకంలో వ్రాయవలసినవి, నేడు వార్థక్యం వద్దంటూఉంటే,ఎలావ్రాయటం?అంటేఒప్పుకొంటేగదా? ఏమిచేయాలి?

ఏమైతేనేమి? చివరికి, వారి నిర్బంధం నుండి తప్పించుకొనలేక, వీని పరిశోధనకు దిగి, నాలుగు వందలకు పైగా పద్యాలు సేకరించి, ఆ చాటు చమత్కార ప్రాజ్య సామ్రాజ్య మేరుపర్వతాన్ని, ఈ 'వినోద సాహిత్య వైచిత్ర్యాలు'' అనే అల్ప ఆదర్శం (అద్దం)లో, కొద్దిగా, దర్శింప, మీ కరకమలముల కందించినాము. ఇక వానిలోని అందచందాలను అర్హతలను ఆఘ్రాణించి, వెలగట్టగల షరాబులు, సహృదయ పాఠక ప్రభువులు మీరే.

ఈ భాగ ప్రచురణకు అయాచితంగా, ఆర్థిక సాహాయ్యమునందించి, ప్రోత్సహించిన, ఆదర్శ వదాన్యశేఖర, వృద్ధ దంపతులగు, శ్రీమతి&శ్రీ పైడమాంబా- శివప్రసాదరావుల 'సుమానుషయశస్సు' (దాంపత్య—సౌజన్య-కీర్తి) చిరకాలము వర్ధిల్ల వలెనని కోరుకొనుచు, వారికీ గ్రంథమును కృతజ్ఞతతో "అంకిత" మిచ్చి ఋణ విముక్తుని పొందగోరుచున్నాము.

పాఠకానాం ప్రహర్షాయ ధిషణాకషణాకరమ్।
సు ధియా స్వధియా ప్రోక్తం చాటు చిత్రం మనోహరమ్॥
"ఆపరితోషా ద్విదుషాం న సాధు మన్యే ప్రయోగ విజ్ఞానమ్"

ఇతిశమ్, వినమ్ర విధేయుడు
"యశస్వీ"
"సాహిత్యరత్న" సూరపనేని వేణుగోపాలరావు

ఆనన్దవర్ధన
విజయవాడ-10

షరా: చిత్ర సాహిత్యంలో హ్రస్వ, దీర్ఘ, అర-నిండుసున్నలకు, ర-ఱలకు అల్ప—మహా-ప్రాణాదులకు 'అభేదకల్పనము' ప్రసిద్ధము.

# శ్రీమతి&శ్రీ త్రిపురనేని పైడిమ్మా ప్రసాదరావుల
# ఆదర్శ దాంపత్యమ్.

కళా, సాహిత్య, సాంస్కృతిక రంగాలకు కాణాచి, దేశభక్తులకు, భావవిప్లవ విద్యా విశారదులకు విఖ్యాత - ఆలవాలము నైన"అంగలూరు"లో, శివ భక్తాగ్రేసరులగు శ్రీమతి&శ్రీ శోభనాద్ర్యమ్మ - శేషాద్రి గారల పుత్రరత్నమగు శ్రీ శివప్రసాదరావు ది. 30-9-1903లో ఒక శుభముహూర్తమున జన్మించినారు. అన్నపూర్ణకు నుద్దియౌ అతని గృహిణి, పట్టినదంతా పైడిగా మార్చగల సార్థక నామధేయ శ్రీమతి పైడిమ్మ. ఈ దమ్పతులు, వినయ వివేక సంపన్న సంతానమునకు,పౌత్ర, దౌహిత్రులకు, విద్యాధనముల వింగడించి, నేడు వాన ప్రస్థాశ్రమమున వాసి గాంచుచున్నారు.

శ్రీ ప్రసాదరావు B.A ,B.L., పట్టభద్రులైనా. సూటుబూటు హేటుల పటాటోపం లేక. కట్టు, బొట్టు, పెట్టు ఇతో ఆంధ్రత్వావిన్న అక్షరాల తలపింపజేస్తూ, న్యాయవాద వృత్తిలో గూడ అజాత శత్రువుగా, న్యాయవాది సంఘ, అర్బను బ్యాంకు, రామ విలాస సభ, పరవిద్యాశ్రమ ట్రస్టులకు, అధ్యక్షులై, పురపాలకసంఘ సభ్యులై,వాని, అభివృద్ధిని సాధించినారు. ఆంధ్రనాటక కళాపరిషత్తుకు కోశాధ్యక్షులై, 1946, 58, 61 సం.లలో, గుడివాడలో, దాని వార్షికోత్సవములను, ముమ్మారు, ముచ్చటగా జరిపించిన గౌరవము వీరికే దక్కినది.

వీరిచేయూతతో చేవనందని సంస్థ, గృధ్ర వాటికలో లే దనుట స్వభావోక్తిమాత్రమే. అది హైస్కూలు విద్యతో అరకొరగా, 'డి' క్రింద 'ద' ఒత్తుతో నున్నట్లు, అజ్ఞా నాంధత్వంతో అణగారియుండ, 'గుడివాడ' ను, గుడి–(గుబి)డులకు=దేవ-విద్యా-ఆలయాలకు)-వాడ'గా, చేయదలంచి, కొందరు వదాన్యులతో గలిసి, వరివస్య (సేవ) కుపక్రమించి, హోమియో, గుడివాడ కళాశాలలకు, ఆంధ్ర నలంద విద్యాలయాలకు, ధనసాహాయ్యం, 1942 సం. లో, కవిరాజు, శతవధాని, బారిష్టరు శ్రీత్రి. రామస్వామి చౌదరిగారికి గజారోహణాది సమ్మానములు చేయించినారు.

4 దశాబ్దాలనుండి, "కవిరాజ సాహిత్య విహార" వ్యవస్థాపకాధ్యక్షులై 'కవిరాజ కళాభవనము'ను నిర్మింపజేసి, ఆంధ్రదేశం నాలుగు చెరగులనుండి, జాతి, మత, కుల, లింగ వివక్షణలేక, కవి, పండిత, కళా

కార ప్రకాండుల నెందరినో ఆహ్వానించి, తెరవెనుక సూత్రధారియై, ఘనముగ సన్మానింపచేగాక, మహాపురుషుల శత జయంత్యుత్సవముల నెన్నింటినో, నేటికీ, అవిచ్ఛిన్నముగ, నిర్వహింపజేయుచున్నారు.

పతనావస్థలో పడనున్న 'పామర్రు' కళాశాలకు 3 లక్షలు, అంగలూరువాటర్ వర్క్సుకు లక్ష.కవిరాజ భావవిప్లవ-పరిశోధనగ్రంథముద్రణకు 6 వేలు, హోమియో, ఏ.ఎన్.ఆర్, కె.టి.ఆర్, పాలిటెక్నిక్ కళాశాలలలో ప్రథమునిగా వచ్చిన వారికి పారితోషికమునకు, 60 వేలతో ట్రస్టును, కవిరాజ భవనంలో గ్రంథాలయ స్థాపనయేగాక, కవిరాజ సాహిత్య విహారంచే, వార్షిక సన్మానాలకై 50వేలతో ట్రస్టు నేర్పరచినత్యాగధనులు. పరుల బాధింపక, దౌష్ట్యానికలొంగక, సన్మార్గము నతిక్రమింపక, బాగుగా విద్యాధనములను క్షణశః, కణశః సంపాదించి, వానిని దాచి మురగబెట్టక, తనకు చావు సమీపించి, జుట్టుపట్టుకొని ఈడ్చుచున్నట్లుగా భావించి, 94వ సం.వరకు కూడ అనేక దానధర్మములు చేయుచున్నారు.

"విద్యాధనం సర్వధనాత్ ప్రధానం"గా భావించి, ఒకనాటి సంభాషణలో,నానాటికి నాసిరిల్లుచున్న ఆంధ్రభాష నాదరించి, తెలుగుమీర (అందగింప) జేయుటకై, చారువులగు చాటు పద్యాలతో తెలుగునాడుకు, పాఠక మహాశయుల కరపద్మములకు, వినోద విజ్ఞాన సర్వస్వము నందించి, కడకు, పరమపదము నధిష్ఠింపదలచి, మహాకవుల పద్యరాజాలను సంకలనంచేసి, అర్థ, తాత్పర్య, విశేష వ్యాఖ్యానాలతో "వినోద సాహిత్య వైచిత్ర్యాలు" అనే గ్రంథాన్ని వ్రాసిన, ఆర్థిక సాహ్యాం చేస్తామని చెప్పగా, వారి కడసారి కోరికను కాదనలేక, మా పరిశోధనను మధ్యలో ఆపి,వారి ఆదేశమునుపూర్తిచేసినాము, 'త్యాగాయ సంభృతార్థానాం'అను కాళిదాససూక్తిని, సూటిగా సార్థకం చేసిన, ఆ ఆర్థిజన కల్పవృక్షానికి అంకితం చేసి, ధన్యంమన్యుల మగుచున్నాము. మానవతావాదాన్ని మాన్యంగా భావించి, త్యాగయోగ్యం చేసిన, శ్రీరావు దంపతుల 'సుమానుషయశము' (దాంపత్య-సౌజన్య-కీర్తి) ఆ చంద్రతారార్కము కావలెనని మా ఆకాంక్ష.

"భద్రం తస్య సుమానుషస్య కథ మప్యేకం హి తత్ప్రార్థ్యతే"

వినమ్ర విధేయుడు, "యశస్వి"

# విషయ సూచిక

## సంకేత వివరణలు (Abbreviations) (కొన్ని)

ఉ=ఉత్తరము-లు
చ. కా=చర్లవారి ఆంధ్ర కావ్యాదర్శము
చ. చ=చమత్కార చంద్రిక
చా.ప=చాటు పద్య రత్నాకరము
చా.మ=చాటు పద్య మణిమంజరి
చా.ర=చాటు పద్య రత్నాకరము
తె.చా=తెలుగు-చాటు కవులు
తె.చా.క=తెలుగులో చాటు కవిత్వం
తె.తి.క=తెలుగులో-తిట్టు-కవిత్వం
ప్ర.=ప్రశ్న-లు
బ.సు.=బయిరెడ్డి-సుబ్రహ్మణ్యం
మ.చ.=మను-చరిత్ర
వ.చ=వసు-చరిత్ర
వి.=వివరణ, విశేషము
వి.వేం.చి=విక్రాల -
వేంకటేశ్వర చిత్రరత్నాకరం
వి.స=విశ్వనాథ సత్యనారాయణ
వే.ల.స=వేదుల-లక్ష్మి-సహస్రం
సం.=సంగతి,సందర్భము-లు
సి.నా.రె=సి. నారాయణరెడ్డి
సూ.పు=సూత-పురాణము

# వినోద సాహిత్య వైచిత్ర్యాలు

## 1. వాక్కమలాంబికేశ్వరులు బ్రోతురుమమ్ము నెప్పుడున్.

కమలజకృష్ణ శంకరులు, కాంచన నీలపటీర వర్ణులా(లు+ఆ)
గమ నగచంద్రధారు,ల,ఘ కంసపురారులు,హంస తార్క్ష్యగో
గమనులు,జన్మపోషల యకారులు, వాక్ కమలాంబికేశ్వరుల్
క్రమ కరుణావిభూతి ఘనశక్తుల బ్రోతురుమమ్ము నెప్పుడున్॥

సం. ఒక కవి, త్రిమూర్తులను, వారి సరంజామ (వస్తుసామగ్రి)ని ఒకే పద్యంలో సంగ్రహించిన విధానాన్ని వీక్షించండి.

కమలజ–కృష్ణ–శంకరులు = కమలము (పద్మము)నుండి పుట్టిన 1. బ్రహ్మ, 2. కృష్ణ=విష్ణువు, 3. శంకరుడు=శుభమును కలుగ జేయు శివుడు, ఈ ముగ్గురు. మ(మి)మ్మున్–ఎప్పుడున్–బ్రోతురు = మ(మి)మ్ములను-ఎల్లపుడు-పోషింతురుగాక!

ఇక, ఆ త్రిమూర్తుల సామగ్రిని, ఆక్రమాన్ని కూడ చక్కగా పరిశీలించండి.

ఆ బ్రహ్మ, విష్ణు. మహేశ్వరులను త్రిమూర్తులు, క్రమంగా, 1)కాంచన-నీల-పటీర వర్ణులు = వరుసగా, 1 బంగారు 2 నలుపు 3 పటీరము (చందనము, ముల్లంగి....)వలె, తెల్లనిరంగుగలవారు. 2) ఆగమ - నగ చంద్రధారులు=1. వేదశాస్త్రాలను, 2. గోవర్ధనపర్వతమును 3 చంద్రుని ధరించినవారు. 3) అఘ-కంస-పుర+అరులు =1 పాపమును 2 కంసుని 3 త్రిపురాసురులను నాశనముచేసిన వారు. 4) హంస - తార్క్ష్య-గో-గమనులు=1 అంచ,2 గరుడ 3 వృషభ(ఎద్దు-నంది)ములను ఎక్కిపోవువారు 5) జన్మపోషలయకారులు=1 సృష్టిని 2 స్థితిని (రక్షణను) 3 నాశమును కల్గించువారు, 6) వాక్-కమలా+అంబికా+ఈశ్వరుల్=వాక్+ఈశ్వర

=1 బ్రహ్మ 2 కమలా+ఈశ్వర = లక్ష్మీ కాంతుడు విష్ణువు, 3 అంబికా+ఈశ్వర=పార్వతికి-ప్రభువు, శివుడు ఈ ముగ్గురు(తమయొక్క), 7) శమ-కరుణా-విభూతి ఘన-శక్తులన్ = 1 శాంతి 2 దయ 3 ఐశ్వర్యము (బూడిద) అనుగొప్ప సామర్థ్యములతో, మ(మి)మ్మున్ - ఎప్పుడున్-ప్రోతురు (ప్రోచుదురు) గాక!

వి. 1. క్రమా (యథాసంఖ్యా)లంకారంతో, త్రిమూర్తులను, వారి వస్తుసామగ్రిని, వాస్తవంగా, కత్తైమట కల్పింప చేయుట గమనార్హము,

2. వాక్కమలాంబికా + ఈశ్వరులు ద్వంద్వ సమాసము, ఈ సమాసంలోని అన్నిపదాలకు చివరనున్న 'ఈశ్వర' శబ్దము, ద్వంద్వసమాసంలోని అన్ని పదాలకు, చివర అనువర్తింపగా, 1 వాగీశ్వర, 2 కమలేశ్వర, అంబికేశ్వరులు వత్తురు.

## 2. మీ కభీష్టఫలసిద్ధి ఘటింతురు

సలిల విహారులిద్దరును, సంతత కాననచారు లిద్దరున్,
వెలయగ విప్రు లిద్దరును, వీర పరాక్రమశాలు రిద్దరున్,
పొలతులడాయువాడొకడు,భూమినిబుట్టెడివాడునొక్కడున్
చెలువుగమీా(మా)కభీష్ట ఫలసిద్ధి ఘటింతురనంత కాలమునన్॥

సం. దశావతారములను ఒకే పద్యంలో ఇమిడ్చి చేసిన ప్రార్థన, విద్రపట్టనపుడు, తెల్లవారు జామున తెలుగునాటి వృద్ధులీ పద్యాలతో భగవత్ స్తుతి చేస్తారు.

సలిల-విహారులు=నీటిలో-దిరుగు 1 మత్స్య 2 కూర్మ-అవతారాలెత్తిన వారు, ఇద్దరును, సంతత-కాననచారులు=ఎల్లపుడు-అరణ్యములలో తిరుగు-3వ రాహ, 4నరసింహ-అవతారులు, ఇద్దరును, వెలయగ-విప్రులు=ప్రసిద్ధికెక్కిన-బ్రాహ్మణ 5 వామన, 6 పరశురామ-అవతారులు, ఇద్దరును, వీర పరాక్రమశాలురు = వీర్యము, శౌర్యము గలవారగు 7 దశరథరామ,

8 బలరాముడు, ఇద్దరును, ప్రౌఢశుక వాయువాడు+ఒకడు=స్త్రీలతో(అష్ట 8 మహిషులతో, 16 వేల గోపికలతో) క్రీడించు ఒక్కడు, కృష్ణుడు, (బుద్ధుడని కొందరు) భూమిని పుట్టెడువాడు — ఒక్కడును=పృథివిలో పుట్టబోవు 10 వ కల్కి అవతార పురుషుడు—ఒకడును — అను ఈ పది అవతారముల నెత్తినవాడు, అనంతకాలమున్-మీ(మా)కు,+అభి+ఇష్ట-సిద్ధులు-ఘటించుత = ఎల్లకాలము - మనకందరకు, కోరిన కోర్కెలను-కలుగజేయుచుండు గాక! అని, కవి ఆకాంక్షించుచున్నాడు.

వి. దశావతారముల విషయమున పండితులలో పలురకములైన అభిప్రాయ భేదములున్నవి. కొందరు, మత్స్య, కూర్మ, వరాహ, నరసింహ, వామన, పరశురామ, దశరథరామ, బలరామ, శ్రీకృష్ణ, కల్కి-అవతారములని చెప్పగా, మరికొందరు, బలరామునికి బదులుగా బుద్ధావతారమును చేర్చిరి........

### 3. నరహరి మా(మీ)కెపుడు సౌఖ్యంబు లొసగు.

క. వనచరములు నాల్గరయున్,
మనుజాకృతులేను, పైన మావొక్కటియై,
తనరిన నరహరి మా(మీ)కెపు-
డనుపమసౌఖ్యంబు లొసగునవనీ-స్థలిలో॥

సం. ఒకకవి, పై 'సలిల విహారులు....' అను, పెద్ద చంపకమాలా పద్యంలో దశావతార వర్ణన చేయగా, మరొకకవి. అర్ధకంద పద్యంలో చేసిన దశావతార వర్ణనను కూడ గమనించండి.

అరయన్ = దశావతారములను బాగుగా ఆలోచించి, పరీక్షించి, చూడగా, వనచరములునాల్గు= నీటిలో దిరుగునవి (మీన, కూర్మములు) రెండు, అడవిలో దిరుగునవి(వరాహ, నరసింహములు) రెండు, మొత్తం

వాలుగు, (వనచరములు) మనుజ+ఆ కృతులు+ఏను=మానవ-ఆకారం ధరించినవారు (వామన, పరశురామ, శ్రీరామ, బలరామ, కృష్ణులు) (బుద్ధవి కొందరు) ఏను = అయిదుగురు, (అ) పైన-మావు (గుఱ్ఱము) + ఒక్కటియై = అటు పిమ్మట-గుఱ్ఱము నెక్కిన కల్క్యవతారము-ఒక్కటిగా, తనరిన=అతిశయించి వర్ధిల్లిన మొత్తం:4+5+1=10 దశావతారములను ధరించిన, నరసింహుడు, అవనీ స్థలిలో=భూలోకంలో, మా(మీ)కు-ఎపుడు+అనుపమసౌఖ్యంబులు +ఒసగున్=మనకందరికి-ఎల్లపుడు-సాటిలేని అనేక-సుఖములను-ఇచ్చును-గాక!అని కవి అభ్యర్థన.

4. ప్రేమంబున బుద్ధి(ద్ధు) చెప్పి పిలువవె కలికి,

క.	ఏమీ నన తాబేలన-
నామంగిటి కేలరాడు నరహరి పిన్నా
రాముని ముమ్మారంపితి-
ప్రేమంబున బుద్ధి(ద్ధు)చెప్పి, పిలువవె కలికీ !

సం. 1 సలిల విరుహాలు.... 2 వనచరములు....ఈ పద్యకర్తలు, చంపక, అర్ధకంద పద్యాలలో, దశావతారములను వర్ణింప, వేరొకకవి ఈ గ్రంథాంతరంలో, సంభాషణలో దశావతారములనిట్లు, వ్యంగ్యంగా వ్యక్తీకరించెను. కొటేషన్లలో పెట్టిన శబ్దాలను గమనించండి.

ఏ-1 మీను (మత్స్య) అనన్, 2 తాబేలు (కూర్మ) అన, ముం (3) 'గిటి'కి, 'కిటి' (వరాహము) 4 నరహరి (నృసింహ), 5 పిన్న+అ =అ పొట్టివామనుడు, ఆ 'రాముని' ముమ్మారు (3)+అంపితి,'అ, 6 పరశురామ, 7 దశరథరామ, 8 బలరాములు ముగ్గురు, 9 బుద్ధి—చెప్పి, 'బుద్ధ'ని కూడా చెప్పి, 'కలికీ'—అని పిలువవె=ఇక 10వ అవతారాన్ని 'కల్కి' అని పిలిచి దశావతారములను చేసెను.

### 5 జంబుకయుక్తులొల్లకు వివేకానందమా! చిత్తమా!

వేదంబుల్ మనుజుల్ రచించి, రతిప్రావీణ్యంబుతో శాస్త్రముల్
తాదృక్పద్ధతి నవ్యవిల్లై! తపముల్ దానంబులున్ ధర్మముల్
మోదం బబ్బను చేయుడంచు నరులన్ బోధించు నవ్విప్రులే
కాదా? జంబుకయుక్తులొల్లకు, వివేకానందమా! చిత్తమా!

N.B. ఈ పద్యాలు రెండు మహాహేతువాది, మానవతావాది, 'చిత్త శతక' కర్తయగు, శ్రీపతి భాస్కరకవి (16, 17శ)గారివి. పరిశీలించండి.

జ్ఞానమునే ఆనందముగా భావించు, ఓ మనసా! కొందరు మానవులు మిక్కిలి నేర్పుతో, చాకచక్యంతో వేదాలను, శాస్త్రాలను వ్రాసి, తపస్సును, అక్కే విప్రులకు, దాన, ధర్మాలను చేసిన, మీకు పుణ్యమూ, పురుషార్థము, సంతోషము, సంభవించును గనుక, వానిని సదా, సద్భక్తితో చేయుడని, నరులకు బోధించువారు స్వార్థపరులగు ఆ బ్రాహ్మణులే గదా! అట్టివారి నక్కజిత్తులకు లొంగిపోవద్దు సుమా! అని, చిత్తానికొక హెచ్చరిక.

### 6. ఇట్టివే వేదంబు లంచెరుంగుము!

బీదలకన్న వస్త్రములు పేర్మినొసంగుము, తుచ్ఛసౌఖ్యసం
పాదనకై అబద్ధముల పల్కకుము, వాదము లాడబోకుము, మ
ర్యాద నతిక్రమింపకుము, పరస్పరమైత్రి మెలంగు, మిట్టివే
వేదములం చెఱుంగుము, వివేకధనంబిది నమ్ము, చిత్తమా!

ఓ మనసా! నిరుపేదలకు అన్నము, బట్టలను దానం చేయుము. మీసాలపై తేనియలవంటి, నీచ సుఖ సంపాదనకై అబద్ధాలాడకుము వివాదాలు, పోట్లాటలు వద్దు. హద్దుమీరి నడువకుము ఒకరికొకరు స్నేహంతో మెలగుము. ఇట్టి, నిత్యసత్య వచనములే వేదములు చెప్పు ధర్మ—బోధలని,

తెలిసికొని, నక్కజిత్తులకు లొంగవద్దు. ఇదియే నిజమైన జ్ఞానధనమని విశ్వసింపుము.

**7. దైవతకోటి....లవలేశము ముక్తి నొసంగనేర్చునే?**

ఇల్లును వాకిలిం గలిగి, యిద్దరొ ముగ్గురొ యాండ్రు గల్గి, పై
బిల్లలుజల్లలుం గలిగి, వెక్కసమైన కుటుంబ భారమున్
వెల్లువ నీదలేక, వలవించెడి దైవతకోటి, నా మొరల్
మెల్లగ నాలకించి, లవలేశము ముక్తి నొసంగ నేర్చునే?

సూ.పు.1-1.

N.B. ఈ క్రింది పద్యాలు, హేతువాది మానవతావాది, "వీరగంధము తెచ్చినారము వీరులెవ్వరొ తెల్పుడీ..' అంటూ, ఆలోచనామృతమైన సాహిత్యంలో భావవిప్లవ కవితాశంఖాన్ని పూరించి, శాస్త్రీయ దృక్పథంవైపు చెన్నారజేసిన, బారిష్టరు కవిరాజు శతావధాని త్రిపురనేని రామస్వామిచౌదరి గారి'సూతపురాణము' నుండి గ్రహింపబడినది.

దేవతా సమూహమునకు ఇల్లు, వాకిలికూడ కలదు. ఇంకా, వారికి ఇద్దరో, ముగ్గురో భార్యలు, పిల్లలు జల్లలు కూడ మెండుగా ఉన్నారు. అట్లు ఆరాధ్యులైన, వారుకూడ, దుఃఖభూయిష్ఠమైన ఈ సంసార భారమనే వరద-ప్రవాహంలో కొట్టుకుపోతూ, ఈది ఒడ్డుకు చేరలేక, దుఃఖించు చున్నారు. ఇట్టి దేవతాగణము మెల్లగా, కొంచెము నా మొరను ఆలకించి, ఎక్కువేమి కాదుగాని, అత్యంతము అల్పాంశతోనైన, నాకు మోక్షము నొసంగుటకు సాహసింతురా? అని నా మొర.

వి. ఆంధ్రంలో అధిక్షేపణ, హేళన కావ్యాలు అంతగా కన్పడవు. అవి ఆనాడు మృగ్యాలే, కవిరాజుగారు సంస్కృతాంధ్రాది సారస్వతాలను అవలోకించి, ఇంగ్లాండులో పాశ్చాత్య భాషలను కూడ పరిశీలించినారు. ఆనాటి కక్కడ ప్రాచుర్యం చెందిన 'అధిక్షేపణ' (Satire)ను అవ

గాహన చేసుకొని, అంతరంలో కూడ ప్రవేశపెట్టినారు. పురాణేతిహాసాదులలో, పూర్వాపర సంబంధ విరుద్ధంగానున్న పుక్కిటి కథలను గ్రుడ్డిగా నమ్మక, మత మద్యంతో మత్తెక్కించక, అజ్ఞానాంధకారంతో అంధవిశ్వాసంతో అలమటించుచున్న పాఠకలోకాన్ని, 'తమసో మా జ్యోతి ర్గమయ'నినాదంతో, విద్యాదీప్తితో, జ్ఞానాంజన శలాకతో, శాస్త్రీయ దృక్పథంతో, ఎదుర్కొని, సన్మార్గగాములను చేస్తూ, దైవతకోటిని కూడా అధిక్షేపిస్తూ ధిక్కరించినారు.''

## 8. ఈ తికమకలేల?... తెల్పగరాదె నిజంబు నీశ్వరా !

**ఒకరుడు 'వేదమే భగవదుక్త' మటంచు నుపన్యసించు, నిం**
**కొకరుడు 'బైబిలే భగవదుక్త' మటంచును వక్కాణించు, వే**
**రొకరుడు మా'ఖొరాన్ భగవదుక్త'మటంచును వాదులాడు,నీ**
**తికమక లేల బెట్టెదవు? తెల్పగరాదె! నిజంబు నీశ్వరా!**

సూ.పు.3_1

వి. కవిరాజుగారి మరికొన్ని పద్యాలను సావధానంగా అవధరించండి.

ఈశ్వరా! ఒక ఛాందసుడు 'వేదాలలోనే భగవంతుడన్ని ధర్మాలను భవ్యంగా వివరించినాడు. అవే సదా సంసేవనీయాలు'అంటాడు మరొకడు మా 'బైబిల్' గ్రంథమే భవ్యమైనది. అదే భగవత్కైంకర్యంగా కర్తవ్య' మని కంకణం కట్టుకొని బోధిస్తాడు. వేరొకడు అవేవీకాదు. మా 'ఖురాన్ గ్రంథమే ఖుద్దున (స్వయంగా) ఖుల్లను (వివరం)గా, ఖుషీ (సంతోషం)గా, ఖుల్లమము (రాచబాట)ను చూపిస్తుందంటాడు, ఇలా, ఇంతమంది ఇన్ని విధాల మా చెవులు గింగిరులెత్తించి, గిజగిజలాడించి, గింజుకొనునట్లు చేస్తుంటే, హేభగవన్! దేవా? అల్లాహో అక్బర్! ఎందుకిలా మమ్ములను తికమక పెట్టి, తిక్కశంకరయ్యలను చేసి, చంపుకుతింటావు?

'తాంబూలాలిచ్చాను, తన్నుకు చావండి' అనటం నీకు న్యాయమా? కనుక, ఓ కరుణామయా! కనికరించి, అసలు నిజమేదోనిగ్గుతేల్చిచెప్పి, మా సందేహాలను పటాపంచలు చేయరాదా?—అను కవిగారి కరుణాక్రందనాన్ని కూడా కటాక్షించండి.

## 9. నిత్య సత్య పరతత్త్వము నాశ్రయించెదన్

ఏది చరాచరంబయిన సృష్టికి సర్వము మూలకారణం
బేది మునీశ్వర ప్రతతికేని యగోచరమైన దొడ్డవె
ల్గేది లయాంతమందయిన నించుక వైకృతమందకుండు, నే
తాదృశనిత్యసత్యపరతత్త్వ మహత్త్వమునాశ్రయించెదన్

ఈ సర్వ-చర-అచర-సృష్టికి ముఖ్యకారణమైనది, నియమనిష్ఠలతో ఎంత కష్టపడినా, మహర్షి సంఘానికికూడ దొరకని గొప్ప ప్రకాశంగలది, ప్రళయకాలాంతమున కూడ ఏమాత్రం వికారంచెందక, యథాస్థితి నంటి యుండునది- అయిన, ఏపరమాత్మ తత్త్వమైతే గలదో, అ(ఇ)ట్టి నిత్యము సత్యమునైన పరబ్రహ్మముయొక్క ఔన్నత్యాన్నే, నేను ఆశ్రయిస్తాను సుమా।

వి. కవిరాజు ఆస్తికుడా? నాస్తికుడా? అని కొందరు క్రాస్చెన్(?) వేస్తారు. అయనకు ఈ రాళ్లు, రప్పలను, విగ్రహాలను పూజించటం, సంకుచిత కుల, మత కుమ్ములాటలు నచ్చవు. వీటినన్నిటినిమించిన, ఏదో ఒక అనిర్వచనీయము, అవాఙ్మానసగోచరము, అణోరణీయాన్ మహతో మహీయాన్' అయిన పరతత్త్వమహత్త్వమేదైతే గలదో, దానినే సర్వలోకసముద్ధరణకై ఆశ్రయిస్తానని ప్రతిజ్ఞచేసినందున, వారిని నాస్తికులని ఎట్లా నిర్ధారణ చేస్తారు?

వేదశాస్త్ర పురాణేతిహాసాలలోని పరస్పర వైరుద్ధ్యాలను, శాస్త్రీయ, హేతువాద, మానవతాదృక్పథంతో, నిష్కామంగా, నిష్పక్షపాతంతో

విమర్శించడం, అంధ విశ్వాసాలతో అలమటించే వారిని, 'ఆలోకం' వైపు మరల్చటం నాస్తికత్వ మౌతుందా ? అన్యాపదేశంగా, దేవదేవుఁను ఆక్షేపించిన పూర్వకవులు లేరా ? "పరైః పరిభవే ప్రాప్తే మ దక్షీనా తవ స్థితిః" హే భగవన్ ! పరులు నిన్ను పరాభవింప, నీ మీదకువస్తే, నీవే నన్ను కాపాడుమని శరణువేడుతావు సుమా ? ఐశ్వర్య మదమత్తుడవు కావద్దు. నన్ను కూడ గుర్తించు" అన్నంత వరకు వెళ్ళినవారు కూడ ఉన్నారు. కనుక, నిజాన్ని నిగ్గుతేల్చి చెప్పుమని, నిర్భయంగా భగవంతుని నిలబెట్టి ప్రశ్నించడం నాస్తికత్వం అయితే, పై కవులనందరినీ, నాస్తికులని అభిశంసించాలి. "నిరంకుశాః కవయః" కదా ? అందుకనే "వ్యాజనిందాది-అలంకారాలు" కూడ ఆవిర్భవించాయి. ఇంకా ఆలోచిస్తే అసలు నాస్తిక శబ్దానికెన్నో నానార్థాలు కూడ ఉన్నాయి".

10 బొమ్మకు నిండ్లు నిల్పు ప్రబుద్ధుల నిచ్చమెచ్చెదన్

మలమల మాడు పొట్ట, తెగమాసినబట్ట, కలంత పెట్టగా
విలవిల యేడ్చుచున్న, నిరుపేదకు జాలిని చూపకుండ, ఉ
త్తలపడిపోయి, జీవరహితంబగు బొమ్మకు నిండ్లు, వాకిళుల్
పొలమును బొట్ర నిచ్చెడు ప్రబుద్ధవదాన్యుల
నిచ్చమెచ్చెదన్ ॥ సూ. పు. 2-1

హే భగవన్ ! నీవెవడవో ? ఏమి చేసెదవో ? ఎన్నిసార్లు జోతలు, మొత్తుకోళ్ళతో మొరాయించినా, నిమ్మకు నీరెత్తినట్లు, గమ్మని చూస్తూ కూర్చున్నావు. ముడుపు గట్టి, వేటమేక తలనరికి చూపి, అంచగొండితనాన్ని లాస్యం చేయిస్తేగాని, మోమోటపడవని, కుహక (మాయ) పోతురాజా దులను, నేనెట్లు పూజిస్తాను? నిన్ను కొల్చుటకు గుడులకేగు

బ్రాహ్మణేతరులను జూచి, దేవుడవైన నీవే దయతో, ఊరకుంటే, ఈ భూదేవులు (బ్రాహ్మణులు) మాత్రం, తమ పుట్టి మునిగినట్లు పోరు పెట్టు చున్నారు. మాలలని, మాదిగలని, అంటరానివారని, దూరంగా కసిరికొట్టు ఈ కుహక జీవులనెట్లు కు స్తరింతును ? .... ఇట్టి నా గోడు చెప్పుకున్న ఆర్తువా ? తీర్తువా ? అదంతా అడియాసయే అవుతుంది. కనుక—

మహానుభావా ! ప్రతిదినం మలమలమాడు పొట్టతోను, బాగుగా మాసి, మురికిబట్టిన బట్టతోను, మనసు కలుషితం కాగా, బిరబిర, విలవిల, రోడ్లవెంటబడి కొట్టుకొంటూ విహ్వలించు, దరిద్రనారాయణులగు నిరుపేదలపై దయచూపి, దీన మానవసేవయే మాధవసేవగా గణింప వలెను, అట్టివారిపై, కలతచెంది, ఆవంతయు దయచూపక, జీవచ్ఛవాలుగా జీర్ణించి, బొమ్మలు మాదిరిగా పడియున్నరాళ్ళకు, రప్పలకు ఆడంబరంగా. ఆశలతో, పొలం-బొట్రు, మాన్యాలు, పేరుకొరకు దానంచేయు ప్రబుద్ధదాతలను కోరి మెచ్చుకొందును ? అని హేళనగా అధిక్షేపిస్తూ హెచ్చరించెను. పేరు ప్రతిష్ఠల కొరకు, తిరిగి ప్రయోజనం పొందుటకు, ఆడంబరంగా ఖర్చుపెట్టుటకంటె, దీనజనసేవయే అవశ్య కర్తవ్యమని కవిరాజుగారి భావము.

## 11. బుద్ధదేవుని పదాబ్జము లౌదల దాల్చు టొప్పదే!

భారత భూతధాత్రితల భాగము సర్వము సొంత యిల్లుగా
నారసి, సర్వ భూతములయందు సమత్వము విజ్జిరాల్చి। నే
వారమణీయ భూతదయ వర్ధిలజేసి, ప్రపంచమందు బెం
పారగ బుద్ధదేవుని పదాబ్జము లౌదట దాల్చుటొప్పదే?

సర్వ భారత భూభాగాన్ని తన సొంత యిల్లుగా భావించి, సర్వ ప్రాణుల యందు సమత్వాన్ని, సామ్యవాద భావాన్ని, వ్యాపింపజేసి,

తత్త్వవతో రంగరించిన రసాత్మక కరుణను, సర్వభూతముల యందు ప్రవర్తిల్లునట్లు వృద్ధి పొందించి, ప్రపంచంలోని సర్వ చరాచర సుఖాభిలాషిగా, సంభావింపదగిన బుద్ధ మహాదేవుని పాదపద్మములకు నమస్కరించి, శిరసావహించి సన్నుతింపుట మేలుకదా? (ఒప్పుదే?), కాదు, అట్టి బుద్ధదేవు పదాబ్జ పరివర్జ్యమే ఒప్పు (ఒప్పు+అదే=అదే-ఒప్పు) అను నిర్ధారణ వ్యంగ్యము.

## 12. 'అక్షరంబు లోక రక్షకంబు'

ఆ. వె. అక్షరంబు తల్లి అఖిల విద్యలకెల్ల
అక్షరంబు లోక రక్షకంబు
అక్షరంబులేని అబలుచ కెందును
భిక్ష పుట్టబోదు పృథ్విలోన ॥

లోకంలోని సమస్తమైన చదువులకు అక్షరమే తల్లి, మాతృదేవత. (హద్దుకూడ). ఆ అక్షరమే సర్వజనులను, భాషారూపంలో రక్షిస్తుంది. అట్టి అక్షరాలు నేర్చుకొనని (చదువురాని) మూర్ఖుడు, అసమర్థుడు, లోకంలో ఎక్కడా ఉండరాదు. ఒకవేళ ఉన్నట్లయితే, భూలోకంలో అట్టి వాని కెక్కడా బిచ్చము, పిడికెడు అన్నం కూడ దొరకదు సుమా!

కనుక, అక్షరాలు నేర్వని వాని బ్రదుకే వ్యర్థమని భావము.

వివరణ : 1. 'అక్షర' మనగా, క్షరము=నాశము, చలనము.... లేక, స్థిరముగా నుండునది. అక్షరమునకు - అకారాది, 'హ' (లేక) 'క్ష' అన్త వర్ణము, ప్రణవము, ప్రకృతి, ధర్మము,జలము, కాలమానము, పరబ్రహ్మ, ఖడ్గము, మారవిది, స్థిరత్వము మొదలగునవి దీని నానార్థములు.

2. ఆ అక్షరముల కలయిక వలననే, మాట, పలుకు, భాష(జాన) విద్య మొదలగునవి ఏర్పడుచున్నవి. ఆ భాష, విద్య, లేనిదే లోకంలో ఏ వ్యవహారము నడవదు అట్టి లోక వ్యవహారాది జ్ఞానమే జనులను రక్షిస్తోంది.

3. విద్య=చదువు, జ్ఞానము, తత్త్వసాక్షాత్కారము, జ్ఞానం గలిగించు గ్రంథాదులు. ఈ విద్యలు 4, 6, 14, 18, అని, శాస్త్రజ్ఞులు విభజించి, వింగడించినారు. ఈ విద్యలేనివాడు కేవలం 'పశువే' కాదు. 'వింత పశు' వని, శాస్త్రాలు ఎన్నో విధాల ఘోషిస్తున్నా, నేటి ప్రజా ప్రభుత్వాలనబడేవి, కోట్లకొలది ధనాన్ని వెచ్చించి, పడరానిపాట్లు పడుతున్నా, స్వాతంత్ర్యం వచ్చి 50 సంవత్సరాలు కావస్తున్నా, రాజ్యాంగం గట్టిగా నిర్దేశించినా, దేశం మొత్తంమీద అక్షరాస్యత అంతగా పెరగకపోవటం పెద్దలోపం.

4. అక్షరము, విద్య, భిక్ష....ప్రకృతులుకాగా, అక్కరము, విద్దె, బిచ్చము....వికృతులు.

## 13. కవితా కన్యకగుణములు రసజ్ఞుడెరుగు

క. కవితా కన్యకగుణములు
కవికన్న రసజ్ఞు డెరుగు కవియే మెరుగున్?
భువిలో కన్యక గుణములు,
ధవుడెరుగునుగాక, కన్నతండ్రే మెరుగున్?

కవిత్వమునందు కన్యాత్వము ఆరోపితమైనది. అందుచే, అట్టి కవిత్వ కన్యక యొక్క, సౌందర్య, సౌభాగ్యాది మంచి గుణములు, ఆ కవితా రసమునకు పరవశుడై ఆనందించు, రసజ్ఞ పాఠకునకే బాగుగా తెలియును. ఆ కవిత్వ మల్లిన కవికి మాత్రం కొంచెమే తెలుస్తుంది.

ఉదా : ప్రపంచంలో గమనించండి. కూతురి యొక్క సంభోగాది కర్మ లలోని ప్రావీణ్యమును అల్లుడు (ఆమె భర్త) తెలుసు కొనగలడు, గాని, కేవలము ఆమెకు జన్మనిచ్చిన తండ్రి కేమి తెలుస్తుంది? కన్యకా గుణ ములు తండ్రికంటె, అల్లునికే ఎక్కువగా తెలిసినట్లు, కవిత్వ గుణములు కూడ వ్రాసిన కవికంటె, రసజ్ఞ పాఠకునకే, ఎక్కువగా తెలియగలవని భావము.

## 14. మూఢుం డెరుగునె? సత్కవి గూఢోక్తుల సారమెల్ల?

క. మూఢుం డెరుగునె సత్కవి
గూఢోక్తుల సారమెల్ల, కోవిదుని వలెన్!
గాఢాలింగన సౌఖ్యము
ప్రౌఢాంగన యెరుగుగాక, బాలేమెరుగున్?

ప్రౌఢకవి ప్రయోగించిన శబ్దశక్తుల, మాటలయొక్క అర్థమును, అంతస్సారమును, పండితుడు తెలుసుకొన్నట్లుగా, మూర్ఖుడు, అజ్ఞాని తెలుసుకొనగలడా? ఎట్లనగా-గాఢాశ్లేషములోని సుఖాన్ని, యువతియు ప్రౌఢయునగు వనిత అనుభవింపగలదుగాని, బాల్యావస్థలోనున్న చిన్నపిల్ల కేమి తెలుస్తుంది?

వి. ప్రౌఢ=18 సంవత్సరాలు పైబడిన సంపూర్ణ యౌవనం గల స్త్రీ.

## 15. నవరస రసికుడె పెనిమిటి....

క. కవితా కన్యక కెందును
కవి జనకుడు, బట్టుదాది, గణుతింపంగా,

నవరస రసికుడా పెనిమిటి
అవివేకియె తోడబుట్టు వనవేమన్నా!

అన వేమ చూపారా! ఎక్కడనైనను, కవితా కన్యకకు తండ్రి కవియే. పొగడ నట్టి బిరుదాజు దాది, లేక ఉపమాలి వంటివాడు. ఇంకను బాగుగా పంగజేంచి చూచినచో నవ (9) రసాల నెరిగిన రసజ్ఞుడే భర్త. ఇక, కవిత్వ కన్యకకు అజ్ఞానియే తోడబుట్టినవాడు-అని కూడ తెలియవలెను.

## 16. దేవునాన మున్ను దేశాని(న) కొక కవి

ఆ. దేవునాన మున్ను దేశాని(న) కొక కవి
యిప్పుడూర నూర నింట నింట
నేగు రార్గు రేడ్గు రెనమంద్రు తొమ్మండ్రు
పదుగు రేసి కవులు పద్మనాభ!

సం. సని ౕరాని మూర్ఖులందరు నేము కవులు, మహాకవులగుచున్నారని వెక్కసపడి, సూరకవి, ఈ పద్యం చెప్పినాడని, కొందరనగా, ఇది అజ్ఞాత కర్తృక మన్నారు వేటూరి వారు.

పద్మనాభా! దేవుని మీద ప్రమాణం చేసి, చెప్తున్నాను. పూర్వం వెదికితే, ఒక్కొక్క దేశానికి, ఒక్కొక్క కవి దొరికేవాడేమో? కాని, నేటి పరిస్థితివేరు. ప్రతి గ్రామంలో, ప్రతి గృహంలో, ఒకరా? ఇద్దరా? కాదు, కాదు, 5,6,7,8,9 లేక పదిమంది కవులు కూడ పుట్టుకొని వస్తున్నారు సుమా? అని మూర్ఖకవుల నింద.

## 17. కాదేదీ కవిత కనర్హం ?

"తలుపు గొళ్ళెం, హారతి పళ్ళెం, గుర్రపు కళ్లెం,
కాదేదీ కవిత కనర్హం? ఔనౌను శిల్ప మనర్ఘం !
అగ్గిపుల్ల, కుక్కపిల్ల, సబ్బుబిళ్ళ (మొ॥ వాటినికూడ,)
హీనంగా చూడకు దేన్నీ, కవితామయమేనోయ్ అన్నీ"

శ్లోకంలో, చివరికి, కవిత్వ వర్ణనకు పనికిరాని వస్తువంటూ ఏదీ లేదు. అగ్గిపుల్లి, కుక్కపిల్లి, సబ్బుబిళ్ళ ...తలుపుకు వేసే ఇనుపగొలుసు, ఆరతి పట్టే పాత్ర, గుర్రం నోటికి తగిలించే కళ్ళెం మొ॥ అన్నీ కవిత్వానికి పనికి వచ్చే వస్తువులే. ఔనౌను. నిజమే? కవితా శిల్పమెంతో విలువగలది (అనర్ఘం). కనుకనే, దేనినీ తక్కువగా భావింపరాదు. అన్నీ కవిత్వంలో అంతిమ్భూతాలౌతాయని భావించాలి - అని ఆధునిక కవులు - శ్రీశ్రీ మొ. వారి హెచ్చరిక.

ఈ విషయాన్ని, సంస్కృత లాక్షణికు లేనాడో గుర్తించి, "రమ్యం జుగుప్సితె ముదార మథాపి నీచం...." శ్లోకంలో చర్చించారు.

ఒక కవితా వస్తువు అందమైనదే కావలెనను నియమం లేదు. అది ఏవగింపు గల్గించేదైనా, ఉదాత్తత లేనిది, హీనమైనదైనా.... చివరికి ఎట్టిదైనను, కవి, భావుక భావ్యమానమై....రసత్వాన్ని పొంది, రాణిస్తుం దన్నారు.

## 18. భువిలో హరిదాసుడైన బుణ్యామె దక్కున్

క. కవితా లక్షణ మెరుగని
అవివేకికి పద్య(కబ్బ)మిచ్చి, అడుగుట కంటెన్,
చలిలెగొని, దండె గొనుకొని
భువిలో హరిదాసుడైన పుణ్యమె దక్కున్

కవిత్వ తత్త్వమును, లక్షణముల నెరిగినవారు కొందరుంటారు. కాని, ఆ కవితా లక్షణములను, మర్యాదలనేమీ తెలియని మూర్ఖునికి, ఒక పద్యాన్నో, ఒక కావ్యాన్నో ఇచ్చి, అర్థం చెప్పమంటే ఏమని చెప్ప గలడు? ఒకవేళ వచ్చీచెడి, ఏ కొద్దిగానో తెలుసుకొన్నా, అతడేమి వివ రింపగలడు? కనుక, అట్టి వాని దగ్గరకు వెళ్ళటం, పద్యార్థం చెప్పుమని మని అడగటం కంటె దురదృష్టకర సంఘటన మరొకటి ఉండదు. కాబట్టి, అజ్ఞానులగు వారి దగ్గరకు వెళ్ళక, ఒక తంబుర (దండె=వాద్య విశేషము)ను, కొంచెం డబ్బు (చవిలో ఖర్చైనా, ఒక తంబుర కొను క్కొని, నలుగురు చేరే ఒక మండపము, రచ్చబండ-చెట్టు-దగ్గరకోచేరి, హరిదాసై పాటలు పాడుకొంటే, కొంచెం పుణ్యమో, పురుషార్థమో వస్తుంది. కాబట్టి కవితా లక్షణ మెరిగి, గౌరవింపని వారి దరి జేరరాదని భావము.

## 19. మాటల నేర్వకున్న అవమానము, న్యూనము, మాన భంగమున్

**ఉ. మాటలచేత దేవతలు మన్ననచేసి వరంబు లిచ్చెదర్,**
**మాటలచేత భూపతులు మన్ననచేసి ధనంబు లిచ్చెదర్**
**మాటలచేత కామినులు మన్ననచేసి సుఖంబు లిచ్చెదర్**
**మాటలనేర్వకున్న అవమానము, న్యూనము, మానభంగమున్**

వి. మాట= పదము, వాక్యము, వార్త, సూక్తి, లోకోక్తి, ప్రతిజ్ఞ, కథ, ప్రార్థన.... మొదలుగునవి.

మనం, మంచిమాటలతో, వాక్యాలతో ప్రార్థించిన, దేవతలుకూడ, తప్పక, గౌరవించి, వరాలిస్తారు. ఆ మంచి మాటలకు మెచ్చి, రాజులు ధనరాసులు కురిపిస్తారు. వాటిని మన్నించిన మహిళలు కూడ మహా సుఖాన్ని అందిస్తారు. కనుక, మంచి మాటలు నేర్చి, అర్థం చేసికొని,

చక్కగా వివరించటం కూడా అభ్యసించాలి. లేకున్న, అగౌరవము, హీనత్వము, గర్వభంగము మొదలగునవి ఎన్నో కలుగ గలవు. కనుక, ప్రతి మానవుడు సూక్తులను, సుష్ఠుగా నేర్వవలెనని హెచ్చరిక.

## 20. చాటు పద్యమిలను చాలదా ? ఒక్కటి!

ఆ. నిక్కమైన మంచి నీలమొక్కటి చాలు
తళుకు బెళుకు రాళ్ళు తట్టెడేల ?
చాటు పద్యమిలను చాలదా? ఒక్కటి !
విశ్వదాభిరామ వినుర వేమ!

తాత్కాలికముగా, తళుకు, బెళుకులతో తళతళలాడు, బుట్టెడు రాళ్ళను, నగలతో పొదుగుటకంటె, సత్యంగా, చక్కగా నున్న ఒక్క 'ఇంద్ర నీలమణి' వంటి దానిని పొదిగిన చాలును. ఎంతో అందంగా ఉంటుంది. అట్లే, నీ రసాలు, చమత్కార, వైచిత్ర్యాలు చేరని చెత్త పద్యాలను చాలా రచించుట కంటె, చమత్కారాన్ని చిందిస్తూ, సంతోషం గల్గించు, ఒక్క 'చాటు పద్యం' రచిస్తే చాలదా? అని వేమన కవి, వేయి విధాల హెచ్చరిస్తున్నాడు.

## 21. "కలి ముదిరిన కొలది వింత గతులన్ చెలగున్"

క. తొలినాళుల పద్యార్థము
తెలియనిచో పాఠకునిది తెలియమి, ఈనా
ళుల వ్రాసిన కవిదోషము – కలిముదిరిన ...

వి. ఈ చాటు పద్యం, కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ గారిది. చాలామంది దీన్ని సభల్లో చదివి, సాగదీస్తారు.

పూర్వం, ఆయా పద్యాలను, చదివి అర్థాలు అన్వయించి చెప్పలేక పోవడాన్ని, పాఠకుని ప్రమాదంగా, తప్పుగా భావించేవారు. పాఠకులు

కూడా, తమ దురదృష్టాన్ని నిందించుకొనేవాడు. ఇక, ఈనాడో, ఆ పద్యం అర్థం కాకపోతే, దానిని వ్రాసిన కవిదే తప్పు. ప్రజల కర్థమయ్యేటట్లు వ్రాయాలిగాని, అర్థం కాకుండా వ్యర్థంగా వ్రాయటం కవిది తప్పా? తప్పున్నరా అంటారు నేటివారు. అవును, నిజమే? వారినేమనగలం? కలికాలం ముదిరిన కొలది, ఇలాంటివిపరీతాలైన పెడవ బుద్ధులు, వింత పోకడలు పెరుగుతూనే ఉంటాయి సుమా? అని, శ్రీ వి. స. గారి విసురు.

## 22. సంస్కృతము కన్న తెలుగు కష్టంబు హెచ్చు.

తే. తెలుగు తెలుగని యద్దాన దిగుటెకాని,
సంస్కృతముకన్న దాన కష్టంబు హెచ్చు
సంస్కృతమునకు ఒక పరిశ్రమము చాలు
తెలుగునకు సంస్కృత జ్ఞాన మలవడ వలె,

చాలామంది తెలుగు సులభమని, దానిలో పాండిత్యానికై ప్రయత్నిస్తారు. కాని వాస్తవాన్ని వాంఛిస్తే, సంస్కృతము కంటె, తెలుగులోనే పాండిత్య ప్రకర్ష సంపాదన కష్టతరము. ఏలన - సంస్కృత ప్రావీణ్యానికి, ఒక్క సంస్కృత భాషాభ్యాసం చాలు. వారికి తెలుగు భాషతో, అంతగా అవసరముండదు. కాని,తెలుగులో పాండిత్య ప్రకర్షకు మాత్రం, ఈ తెలుగుతో పాటు, సంస్కృత భాషా పరిశ్రమ కూడ తప్పని సరి. కనుక, తెలుగు కంటె, సంస్కృతాభ్యాసమే సులభమని, తిరుపతి వేంకట కవుల కథనం, తీర్పు.

## 23. "సర్వసమ్మతిని గూర్చు కావ్యము" - ఆటపాటలే?

మాటలు మాత్రమా! కవిత? మానసమందున వేడిలేని ఆ-రాటము, శబ్ద గుంభనము రంజిల కుండిన - అర్థలేని పో-

కాటము, కావ్యకృద్వ్యాసులు రమ్యమటంచనకున్న రాతితో-
కూటము, సర్వసమ్మతిని గూర్చెడు కావ్యము-ఆటపాటలే?

ఏవో అలవోకగా, అసంబద్ధంగా, కులాసాగా కబుర్లు చెప్పు కొన్నట్లు, కావ్యం లేక కవిత్వం వ్రాయటం అంత సామాన్యమా? అంద రికీ అంత తేలికగా అయ్యే పనియా? కాదు, కాదు. ఆ కవిత్వ రచన, జ్వరం రాకుండానే, మనస్సులో, వేడిని, సంతాపాన్ని, సంతరిస్తుంది. దానిలోని పదాల కూర్పు, రీతి, సరిగా లేకున్నచో, అది ఆత్తలేని పోరా టం వంటిది. దాన్ని పఠించిన కవి పండితులు "రమణీయంగా ఉన్నది" అని తృప్తిపడి చెప్పక పోయినచో, అది రాతితో కొట్టిన సమ్మెట పోట గును. కనుక, అట్లు గాకుండా జాగ్రత్తగా వ్రాయబడిన కావ్యమే, అంద రికి అంగీకార యోగ్యమై, ఆనందానికి ఆలవాల మవుతుంది. అట్టి మహా కావ్యం వ్రాయటం, ఆటలు, పాటల వలె అంత తేలికగా ఉంటుందా ? ఉండదు గనుక, కవి జాగ్రత్తపడి, అలా వ్రాస్తే, దానిని పాఠకులు పఠించి అర్థం చేసుకుని, ఆనందించాలని భావన.

## 24. 'ఖంకయ్యెనా తప్పులు పట్టు....'

ఉ. గొప్ప కవీంద్రుడైన వినగోరు కవిత్వము, చూచినంతలో
చెప్పును తప్పునొప్పు, నిరసింపక దిద్దును, ఖంకయయ్యెనా
తప్పులు పట్టు, యుక్తి పెడదారికిదీయు, 'గరాను', దాని దా
ద్రిప్పుట బెట్టు, వాని తలడీయు, సదాశివ! సద్గురుప్రభూ!

సదాశివ! సద్గురువర్యా! దేశంలో గొప్పగొప్ప కవీశ్వరు లెందరో, ఇతరుల కవిత్వాన్ని, దానిలోని ఇంపుసొంపులను వినాలని, కోరుకొంటూ ఉంటారు. విన్న తర్వాత వానిలోని మంచిచెడ్డలను, అర్థానర్థాలను తనకు తోచినట్లు స్పష్టంగా, తెల్పుతారు. తిరస్కరింపక, చొరవ తీసుకొని, ఇక్కడ ఇది ఇలా ఉంటే బాగుంటుందని, దిద్దిచెప్పుతారు. ఇక సరిగా,

చదువరాని మూర్ఖ (గరాసు)డు, దుష్టుడునైనచో, వెదకి, వెదకి, ఆ కవిత్వంలోని ఒప్పులను విడచి, తప్పులను, మాత్రమే పట్టుకొంటాడు. విడచిపెట్టక వానిలోని మాటలకు, విపరీతార్థాలు, వెడర్థాలు తీసి, క్రూరత్వం, గర్వం కూడ ప్రదర్శిస్తాడు. వాని తస్సదియ్య! అట్టివారి తలకాయ తీసి వేసినా తప్పులేదు సుమా!

## 25. 'చెడనిది పద్యం బొకటియె!'

క. గుడికూలును, నుయిపూడును
వడినీళ్ళను చెరువుతెగును, వనమును ఖిలమౌ,
'చెడనిది పద్యం బొకటియె'
కుడియెడమల కీర్తిగన్న గువ్వలచెన్నా!

ఇటు, అటు అనక, అన్ని దిక్కులా, దానధర్మాదులతో కీర్తిని వ్యాపింపజేసుకొన్న చెన్నప్పగారూ? సప్తసంతానాలతో సంబరపడాలని, దాలెందరో గుళ్ళను, గోపురాలను, నూతులను, చెరువులను, ఉద్యానవనాలను నిర్మించి, ఖ్యాతిని గడిస్తారు. కాని, ఇవన్నీ, కొద్దికాలానికే నాశనమై పోతాయి. తరువాత బాగుచేయించేవాడుండడు.

ఇక చెడనిది, నాశనం కానిది ఏదంటే, సత్కవి యొక్క పద్యమొక్కటియే. కనుక అట్టి, చమత్కృతి మత్పద్యాలను, తత్కర్తలగు మహాకవి పండితుల నాదరించి, పోషించి,వారికావ్యాల నంకితము గొనినను, వాని ముద్రణకు సాయం చేసినను, దాతల యొక్క కీర్తి లోకంలో చిరస్థాయిగ నుండునని భావము.

నన్నయాది మహాకవుల కాలంలో, నాటుకలాలు, పత్రాలుకూడ లేకపోయినను, చమత్కార, వైచిత్ర్య, వైభవాలను చిందించేవారి పద్యాలు తాత్కాలికములు కాక, నేటికీ సుస్థిరములైయున్నవి. ఆ కవుల, వారి కావ్యాలను అంకితము పొంది పోషించిన దాతల, పోషకుల కీర్తిప్రతిష్ఠలు

కూడా నిల్చియున్నవి, అవి నేటికే గాక, ఏ నాటికి చిరస్థాయులు కాగలని భావము.

## 28. "వడగళ్ళ కట్టువడునా గుడి"

క. అడుగ దగువారి నడుగక
బడుగుల నడుగంగ లేమి బాపంగలరా?
వడగళ్ళ కట్టువడునా
గుడి? రాళ్ళను కట్టకున్న గువ్వలచెన్నా!

ఎవరైనా, ఇచ్చేది, ఇవ్వంగల దాతల నడిగితే దానం చేస్తారుగాని, చేతిలో గవ్వకూడ లేని ప్రజాసులను, బక్కవారి నడిగితే ఏమి ఇస్తారు? వారు యాచకుల దారిద్ర్యాన్ని పోగొట్టగలరా? ఏలయనగా, ఒక గుడి కట్టవలెనంటే, గట్టి ఇటుక, కొండ, కాళిరాళ్ళతో కట్టవలెను గాని, వాన కురియునప్పుడు, గడ్డగట్టి, రాళ్ళవలె పడుచున్న మంచు వడగళ్లుకూడ, రాళ్ళవలెనున్నవి గదా అని, వానితో దేవాలయ నిర్మాణము సాధ్య పడు తుందా? అని నీళ్ళు గార్చి విష్పలమైనట్లు, ఇవ్వగల, ఇప్పింవంగల దాన బుద్ధి గల, వదాన్యులనే యాచించవలెను.

ఒకప్పుడాదాత సమయానికి లేక, ఇవ్వకపోయినను నష్టంలేదు. బాధపడము. అట్లుగాక, ఒకప్పుడు నీచుని, పిసినిగొట్టును యాచించి, కోరిన కోర్కె దీర్చుకొన్నను, అది ప్రక్కలో బల్లెమువలె బాధపెట్టుచునే ఉంటుంది. కనుకనే, కాళిదాస మహాకవి "యాచ్నా, మోఘా వర మధిగుణే నాధమే లబ్ధకామా" అని నుడివెను.

అనగా - ఒకప్పుడు గొప్పవారి నడిగి లేదనిపించుకొన్నను, నష్టము లేదుగాని. అధముడగు నీచునడిగి, కోర్కె దీర్చుకొన్నను లాభం లేదని, కనుక, వదాన్యశేఖరులనే వందించి, లబ్ధకాములై సుఖించాలని భావం.

## 27. రొయ్యకు లేదా? బారెడు మీసము.

క, ఇయ్యగ, ఇప్పింపఁగల
అయ్యలకే కాని, మీస మందరికేలా?
రొయ్యకు లేదా బారెడు
కయ్యమునకు, కుందవరపు కవిచౌడప్పా!

'మీసము' అనునది పౌరుషమునకు, మగవాడికి మాన్యచిహ్నము. అట్టి మీసము, తాను స్వయంగా దానధర్మాలు చేయగలవానికిని, అట్లే ఇతరులకు కూడా చెప్పి, వారిచే దానధర్మ పుణ్యకార్యాలు పౌరుషంతో చేయింపగల వారికి మాత్రమే ఉండవలెను. అంత మాత్రం కూడా చేయని చేయించలేని వారికి, లోభులకు మీసములుండియు ఏమి ప్రయోజనము? 'రొయ్య' అని పిలువబడే ఒకరకం చేపవంటి దానికి, తెగబారెడు మీసము ఉన్నది? అది పోట్లాడుటకు తప్పితే, ఇక దేనికీ పనికిరాదు. కనుక దాన ధర్మములు చేసి, చేయించు సామర్థ్యము, పౌరుషము గలవారికే మీస ముండవలెను, కాని, ఇతరులకు ఉండరాదని, కవి చౌడప్ప భావము.

## 28. కవులిల దానపాత్రులయి గౌరవమందుట చూడచిత్రమా!

అవగత శబ్దశాస్త్రచయులైన మహాత్ములు పండితోత్తముల్
భువన తలంబునం దధికపూజ్యులు, వారలటుండ, కూటికై
నవనవకల్పనావిధి చణత్వము దోప, నబద్ధమాడు, నీ-
కవులిల దానపాత్రులయి గౌరవమందుట చూడచిత్రమా!

కొందరు కుకవులు, కవులనబడుచూ, దానానికి అర్హతను సంపాదించటం, గౌరవింపబడటం చూస్తే, కొందరికి చిత్రంగా తోస్తోందట! ఎవరా కవులు? అనగా, సాహిత్య, ఛందోవ్యాకరణాది సర్వశాస్త్రాలను ఎంతో కష్టపడి, నియమనిష్ఠలతో సద్గురువులనారాధించి, చదివి, వంట

జట్టించుకొన్న, మహానుభావులగు, శ్రేష్ఠపండితులు, పరోపకారపరాయణులయినవారు, భూలోకంలో, సర్వవిధాల గౌరవింపబడి, సేవింపదగినవారనటంలో, మాకేమి అభ్యంతరంలేదు. వారు సర్వదా, సర్వథా సంపూజ్యులే. వారినలా వదలండి.

అట్లుగాక, పూర్వశాస్త్రాదుల పరిచయంకూడలేక, 'పాతాకరోత', 'ఛాందస'మనీ, 'క్రొత్తొక వింత-గొప్ప' అనీ, చెప్పుచూ, వారేవో నిత్య నూతన కల్పనలు చేస్తున్నారని, ఇతరు లనుకొనేటట్లు నటిస్తూ, కూటి కోసం కోటి అబద్ధాలు చెప్పి- నమ్మింపజూచు 'కుకవులు' (పెద్ద-దుష్ట-కవులు) కూడ, కొందరు దానార్థులై, మర్యాదలను, మన్ననలను పొందటము చూస్తే, కొందరికి చిత్రంగా కనబడుతోందట! (మీరేమంటారు?)

వి. 'పాత రోత, కొత్త వింత' అనటం రెండూకూడ సరియైనవి కావు, ఒకప్పుడు వానిలో ఒకటి, లేక రెండు కూడ సమంజసాలు కావచ్చు. భిన్నాభిప్రాయాలు లోకంలో కావలసినన్ని కాపురం చేస్తున్నాయి. అంత మాత్రాన, పోరాటాలకు ఆరాటపడటం ఆచరణీయంకాదు. సత్పురుషులైన వారు ఆ రెండింటివి బాగుగా పరిశీలించి, మంచివానిని మన్నించాలి. కేవలం 'విస్సన్న చెప్పినదే వేద'మని, వల్లెవేయక, స్వబుద్ధితో నిశ్చయించుకొనక అంధానుకరణచేస్తే 'మూర్ఖు'లంటారు. కనుక, 'పాతకొత్తల మేలి కలయిక మంచిది' అని గ్రహింపవలెను.

**29. 'కుల జయ జాయ'-పెరకోమలి మాయయ కాక జాయయే?**

పలుమరు శాస్త్రముల్ చదివిపండితుడై, యజురాణిసత్కృపా
ఫలమును గాంచి, తా రసము బాగుగ జెప్పవలంతి యైనవా
డిల'కవి', లాతివాడు'కపి'యే యనిచెప్పగనొప్పు, 'జాయ' నా
'కులజ'యజాయగాని, పెరకోమలి 'మాయ-యయ' కాక,
జాయయౌనె!

ఒకటికి నాల్గుసార్లు శాస్త్రాలను చదివి, చర్చించి, వంటబట్టించు కొని, సరస్వతీదేవి కరుణాకటాక్షమునుగాంచి, సాహిత్యంలోని సార స్యాన్ని, స్వారస్యాన్ని కూడ, చక్కఁగ, చిక్కఁగ, వింగడించి, చెప్పగల సమర్థుడే లోకంలో సరియైన కవి' అని చెప్పదగినవాడు సుమా! అట్లు, శాస్త్రపరిచయంలేని మూర్ఖుని, 'కపి'(=కోతి) అనుటయే మంచిది. లోకంలో భార్య (జాయ)అనగా, సత్కులమునబుట్టి, సకలసద్గుణవతియైన పతి వ్రతయే 'జాయ' అనదగునుకాని, తద్విపరీత గుణములుగల 'వేశ్య, ఉంపుడుకత్తె' మొదలైన వారెంతటి వారైనను, 'జాయ' అనబడటానికి అర్హులౌతారా? కారు ! కాజాలరు ! అయితే, మరేమౌతారు? ఉత్త 'మాయ'లు, మోసగత్తెలు మాత్రమే సుమా!

వి. కనుక, సర్వశాస్త్రాధ్యయనం చేసి, సరస్వతీ కటాక్షంతో, సాహిత్యసారస్యాన్ని సర్వజనులకు సమర్పించేవాడే 'కవి' అని భావం.

## 30. 'కమ్మని గ్రంథం విచ్చిన–కొమ్మని ఈయరె అర్థము'

క. కమ్మని గ్రంథం బొకటి
ఇమ్ముగ ఏనృపతికైన కృతి ఇచ్చిన, కై-
కొమ్మని ఈయరె అర్థం?- బిమ్మహి దున్నంగనేల?
బిమ్మహి దున్నంగనేల? ఇట్టి మహాత్ముల్॥

సం. పోతన మహాకవి హాలికుడు. (రైతు) "మడిదున్నుకు బ్రతుక వచ్చు" ననుకొన్న నిరాడంబరుడు. రైతుబిడ్డ. పూర్వమొక కావ్యాన్ని నరాంకితం చేసినా, తర్వాత 'భాగవత' గ్రంథాన్ని నరునికంకితం చేయ రాదన్న నిశ్చితాభిప్రాయం కల్గినవాడు. అతని బావమరిది(?) శ్రీనాథుడు తన కావ్యాలను నరాంకితంచేసి, దీనారటంకాలతో తీర్థమాడిన....కవిసార్వ భౌముడు. అతడీ పద్యాన్ని దరిద్రదామోదరుడగు పోతన్నకు బోధించినా డంటారు కొందరు.

బావా! నీ కమ్మని కావ్యాన్నొకదానిని, ఇంపుగా, ఏరాజునకైనా అంకితమిస్తే, ఆతడు కావలసినంత ధనాన్ని తీసుకోమని చెప్పి ఇస్తాడు గదా! మహానుభావుడవైన, నీ కీమడికి దున్నుకు బ్రతుకు నికృష్ట జీవితమేల? నా మాటను మన్నించి అంకితమిమ్ము.

వి. 1. కవి, సహజ పాండిత్యుడగు పోతన, ఆ కావ్యాన్ని ఆ కటికై కొనిపోయి, అల్ల కర్ణాటకిరాట కీచకులకమ్మలేదు.

2. నేడు రాజులు లేరు కనుక, దానశీలురు, వదాన్యులు, ధనవంతులు, ప్రజానాయకులు, ప్రజాప్రతినిధులు.... మొదలగువారని భావింపవలెను.

**31**. 'రసికులైనవారు రమణులకు-వంగుటెల్ల ధర్మవర్తనంబె?'

ఆ. రసికులైనవారు రమణుల కొకవేళ
వంగుటెల్ల ధర్మవర్తనంబు,
ఈ రసమున విల్లు నారికి లొంగదా?
చిత్తజాతరూప! సింగభూప!

సం ఒకప్పుడు సింగభూపాలు నాశ్రయించిన, పోతరాజే, ఈ పద్యాన్ని పల్కినట్లు, 'సమగ్రాంధ్రసాహిత్య'కర్త శ్రీ ఆరుద్ర, ఆర్ద్రంగా చెప్పినారు.

ఏదైనా, తప్పనిసరిగా, ఒకానొక సమయంలో, రసజ్ఞశేఖరులైన వారు,తమ ప్రియురాంద్రగు రమణులకు లొంగి,ప్రవర్తిస్తే, అది 'అధర్మ' మని ఆరడిపెట్టరాదు. అది ఒకప్పుడు ధర్మప్రవర్తనమే అవుతుంది, ఎట్లనగా, ఒకప్పుడు. ఈరసం(అసూయ ఈర్ష్య)తో ధనస్సు 'నారి'కి (అల్లె త్రాటికి) లొంగి, వంగిపోవటంలేదా?

వి. 1. స్త్రీ పురుషులకు సమాన స్వాతంత్ర్యమంయున్న ఈనాటిది గాదీ పద్యం. పురుషాధికాహంకారాలను పూర్తిగా చాటుతున్న ఆనాటిదీ పద్యం. అయితే "క్రాంతి(త్రి)" దర్శియగు కవి, భవిష్యత్తును భవ్యంగా ఊహించి, భావితరాలవారు, వనితల వాగ్స్వాతంత్ర్యాదుల నడ్డుకొనరాదని, వ్యంగ్యంగా, అన్యాపదేశంగా, శ్లేషతో, చమత్కరించినాడు.

2. ఇక్కడ కవి 'ధర్మ, నారి' శబ్దాలను అప్రయత్నంగానేకావచ్చు, నానార్థసంశ్రయ శ్లేషతో వాడినాడు. ధర్మము=న్యాయము, సామ్యము, సత్సంగము, "విల్లు", నారి='అల్లెత్రాడు', 'స్త్రీ'. ధర్మ=ధనుస్సు (విల్లు) ఎంత గొప్పదైనను, అల్లెత్రాటికి (నారికి) లొంగివంగటంలేదా? 'అది' 'ధర్మవర్తనంబు' (ఇంటినడక వంటిది) కావచ్చునని, కవిశ్లేషతో సమర్థించుచున్నాడు. ఎట్లన, ఒకప్పుడు, విల్లు (ధర్మము) నారికి (అల్లెత్రాటికి) లొంగి, వంగటంలేదా అని, ధర్మ, నారి, శబ్దాలను నానార్థశ్లేషతో చెప్పటంతో, అట్లు వంగుటలో, న్యాయము. సామ్యమును సంభవింపగలదు. అది 'ఇంటి' నడవడిక వంటిది సుమా! అని గ్రహించిన, న్యాయము, సామ్యము సంభవింపగలదు.

## 32. 'సర్వసమ్మతిని గూర్చు కావ్యము'-ఆటపాటలే?

మాటలు మాత్రమా! కవిత? మానసమందున వేడ్కిలేని ఆ
రాటము, శబ్దగుంభనము రంజిలకుండిన అర్తిలేని పో
రాటము, కావ్యకృద్వరులు రమ్యమటంచనకున్న రాతితో
కూటము, సర్వసమ్మతిని గూర్చును కావ్యము-ఆటపాటలే?

ఏవో కబుర్లు చెప్పినట్లు, కావ్యంలేక కవిత్వం వ్రాయడం సామాన్యమా? అందరికో, అంతతేలికగా అయ్యేపనియా? కాదు, కాదు, అది, జ్వరం లేకుండానే, మనస్సులో వేడిని, సంతాపాన్ని కలిగిస్తుంది సుమా?

ఇంకా దానిలోని పదాల కూర్పు, రీతి సరిగా లేకున్నచో, అది, అర్థంలేని అరసికిని, పోట్లాటను గలిగిస్తుంది. పఠించిన కవి పండితులు రమణీయమైనది అని చెప్పకపోయినచో, అది రాతితో కొట్టినట్లు సమ్మెట పోటౌతుంది. ఇట్లు గాకుండ వ్రాయబడిన కావ్యమే, అందరికి అంగీకార యోగ్యమై, ఆనందానికి ఆలవాలమౌతుంది.

అట్టి మహా కావ్యం వ్రాయటం, ఆటలు, పాటలవలె అంత తేలికగా ఉంటుందా? ఉండనే ఉండదు గనుక, జాగ్రతగా కవి వ్రాస్తే, పాఠకులు దానిని చదివి, అర్థం చేసుకొని, ఆనందించాలని భావన.

**33. 'ఖండిత మాడినన్ మిగుల దండమె వచ్చును'**

**వండెడివాని, నక్కవిని, వైద్యుని,మంత్రిని,మంత్రవాదినిన్**
**కొండెము చెప్పువాని, రిపుగూడినవాని, ధనేశునిన్, ధరా**
**మండలమేలువాని, తన మర్మమెఱింగిన వానితో, వెసన్**
**ఖండిత మాడినన్ మిగులదండమెవచ్చును నెంతవారికిన్॥**

ఒక్కొక్కపుడు కొందరితో కచ్చితముగ మాట్లాడినచో, అది దండుగను, శిక్షను కూడ కల్పింపవచ్చును. నిజమాడుట నిష్ఠురమగును. కనుక, వంటవాడు, మంచి కవి, డాక్టరు, మంత్రి, మంత్రా లుచ్చరించు వాడు, చాడీలు చెప్పువాడు, తన శత్రువులతో చేయి కలిపినవాడు, మిక్కిలి ధనం గలవాడు, భూమండలాన్ని పాలించురాజు, తన రహస్యము(గుట్టు) ల నెరిగినవాడు-మొదలగు వారితో, తొందరపడి, నిజమును కూడ కచ్చితముగ, తెగగొట్టినట్లు చెప్పి మాట్లాడినచో, తామెంత గొప్పవారైనను, వారికి తప్పకుండా, దండుగ, శిక్షకూడ సంభవింపవచ్చును. కనుక, జాగ్రత్తగ ఆలోచించి, మాట్లాడవలెనని భావము

N.B. ఈ పద్యం చా. ప. మంజరి, చా. రత్నాకర, రత్నావళు లందును గలదు.

## 34. 'మహా దరిద్రము గాల్చువాడొకడు పుట్టకపోయె! నక్కటా!

నరుడను వాడు ఖాండవ వనంబు వృథాదహనంబు చేసె, వా
నరవరుడైన ఆపవననందను డూరక లంకగాల్చె, ఆ-
హరుడు పురంబులార్చె నన, అంతియెగాని, 'మహాదరిద్ర వి-
స్ఫురణను గాల్చువాడొకడు భూమిజనింపకపోయెనక్కటా!'

పూర్వం ఎందరో మహానుభావులు పుట్టి, ఎన్నో ఘనకార్యాలు సాధించినారు. ఉదా: 1. అర్జునుడు (నరుడు) ఒక్క అగ్నిదేవుని అజీర్ణ-రోగాన్ని పోగొట్టుటకు, వనమూలికలతో వర్ధిల్లుచున్న 'ఖాండవ'మను అరణ్యాన్ని కాల్చి, బూడిద చేసినాడు 2. మరొకసారి వానరుడైన (కోతి) వాయుపుత్రుడు హనుమంతుడు 'నగరీషు లంకా'.... (పట్టణాలలో లంకా నగరము మిగుల గొప్ప అందమైనది)గా ప్రసిద్ధిగాంచిన 'లంకానగరా'న్ని భస్మీకరించాడు. అల్లే, ఆ ముక్కంటి (శివుడు) కూడ, త్రిపురాసురుల యొక్క మూడు సుందర నగరాలను బూడిదగా మార్చి వేశాడు. ఇవన్నీ నిజమే! వీరందరు, కొందరు వ్యక్తులకు, కొన్ని సంఘాలకు సాయంచేయటానికే, పైవాని నన్నిటిని వ్యర్థంగా కాల్చి, బూడిద చేశారు. కాని, ప్రపంచంలోని దరిద్ర నారాయణులగు ప్రజలనందరినీ, ఎన్నోచోట్ల, ఎన్నో యుగాలుగా, ఎన్నో విధాలుగా బాధించే, ఆ మహాదరిద్ర దేవత యొక్క విజృంభణను మాత్రం అడ్డుకొని, దానిని బూడిద బుగ్గిచేసే, నాథుడొక్కడు కూడ, భూమిలో పుట్టకపోవడం, చాల ఆశ్చర్యంగా ఉన్నది. కొద్దిమందికి చేసిన సేవకంటె, ఎక్కువమంది ప్రజలకు చేసిన సాయం ప్రకృష్టమై, సార్థకతను సాధించుకొంటుంది సుమా! - అని భావం.

**35. 'ఇంద్రజాలిక శక్తిని దెలియు డీ భావవిదులు'**

సార్వభౌముని నైన సన్న్యాసిగా జేయు,
జోగినైనను మహా భోగి జేయు,
తలక్రిందుగను పర్వతము లెక్కగా జేయు,
వారాశి మోకాలి బంటి జేయు,
వినువీథి నవలీల విహరింపగా జేయు,
సింగంబుపై స్వారిచేయు జేయు,
భగభగమను నగ్ని దిగ్రమింగగా జేయు,
అల చందమామ ముద్దాడ జేయు,
బొందితోడను స్వర్గంబు పొంద జేయు
నవ్వులో నేర్పు, నేడ్పులో నవ్వ జేయు
ఇంద్రజాలికశక్తిగా నొనరునట్టి
రమ్యమగుదాని దెలియుడీ భావవిదులు

N. B. ఈ పద్యంలోని ప్రశ్నలకు ప్రత్యుత్తరమైనది 'కల' (స్వప్నము).

సాధారణంగా 'కల'లో కన్నది ఇలలో జరుగవచ్చు, జరుగక పోవచ్చు. కాని, ఆ 'కల' మాత్రం మనలను, పరి పరి విధాల ప్రజలను పలవింపజేస్తుందనుటమాత్రం నిజము. ఎట్లనగా-ఆ స్వప్నం,అందరికి,ఒక గొప్ప చక్రవర్తిని ఏమీలేని 'సన్న్యాసి'ని, బికారిగాచేసి చూపిస్తుంది. సర్వ సంగ పరిత్యాగియగు యోగినైనను, సర్వ సౌఖ్యముల ననుభవింపజేసి, మహా భోగిగా మలచి చూపిస్తుంది. తలక్రిందుగా చూపి, పర్వతాన్ని ఎక్కిస్తుంది.

అంతులేని లోతుగల సముద్రాన్ని ('వారాశి'ని) అడుగు లోతు న్నట్లు తక్కువగా ప్రదర్శింపజేస్తుంది. ఆ కాళంలో సులభంగా విహారం చేయిస్తుంది. క్రూర సింహంపై స్వారి చేయిస్తుంది. కణ కణ మండు చున్న నిప్పును మ్రింగింప జేస్తుంది. ఆ ప్రసిద్ధ చంద్రుని దరిజేర్చి, ముద్దాడింపజేస్తుంది. ప్రాణమున్న దేహంతోనే స్వర్గానికి చేరుస్తుంది. నవ్వులో ఏడుపును, ఏడ్చునప్పుడు నవ్వును చూపి, నాట్యమాడిస్తుంది.

ఇట్లనేక విచిత్ర విషయాలను, ఇలలో జరుగని వానిని, గారడీ వాని మాదిరిగా, తాత్కాలికంగా రమ్యంగా చూపించు శక్తిగలది, ఆ ఆ 'కల' యే సుమా! మొత్తం మీద, గారడీవాడు గమ్మత్తుగా క్షణకాలం చూపినట్లు, కలకూడ, ఉన్న దానిని లేనట్లు, లేనిదానిని, ఉన్నట్లు చూపించి, ఈ 'కల' మానవుని విచిత్రంగా భ్రమింపజేస్తుంది సుమా! అని భావం.

## 36. 'ఆది పంక్త్యక్షరాల ప్రత్యుత్తరాలు'

పద్మనాభుని ప్రక్క బాయని దెవ్వరు?
కంకి ముఖుండేపె బలిమి గూడె?
భాగీరథుండేమి పాటించి తెచ్చెను?
భావజ జనకుని పానుపేది?
గ్రహరాజసూనుని ఘనమైన పేరేమి?
మహిలోన భూపతి మన్న నేమి?
ముత్యమే కార్తెలో ముందు జన్మించును?
సోమకు నేమియై స్వామి దునిమె?

అన్నిటికి జూడ మూడేసి అక్షరములు
ఆదిపంక్తిని జూచిన నలరుచుండు

అట్టి శ్రీరంగనాయకు డనుదినంబు
మనల కరుణావిధేయుడై మనుచుచుండు.

N. B. తెలంగాణా వాసి యగు శ్రీ వాపిసెట్టి సీతారామ కవి, చిత్ర కవీశ్వరుడు. అతడు, తన పద్యాలలో, ఆ ప్రాంతంలోని దేవుళ్ళనే గాక, వాల్మీకి, వ్యాస, కాళిదాసాది కవీంద్రులను కూడ పేర్కొని, పాండిత్యంతోపాటు, చమత్కార, శైలులను కూడ, చెన్నారజేసినాడు. అతని కొన్ని ప్రశంసార్థ పద్యాలను, మూడక్షరాల ప్రత్యుత్తరాలను కూడ, పరిశీలించి, పాఠకులు నిగ్గును నిర్ధారించండి.

ప్ర 1. పద్మనాభుని (విష్ణుని) పానుపుకు విభువని దెవతె? ఉ. 'శ్రీలక్ష్మి' (పద్మ)

2. రావణుడు (పంక్తి=దశ) బలాత్కరించి, ఎవతెతో రమించెను ? ఉ. 'రంభ'తో.

3. భగీరథుడు తపస్సుచేసి, దేనిని సాధించెను? ఉ. 'గంగ'ను (భాగీరథిని).

4. మన్మథుని తండ్రి విష్ణువు యొక్క పక్క ఏది? ఉ. 'నాగము' (ఆదిశేషుడు)

5. గ్రహాధిపతి యగు సూర్యుని కొడుకు గొప్పపేరేమి ? ఉ. 'యముడు'.

6. భువిలో భూపతికి గౌరవమిచ్చునదేది? ఉ. 'కరుణ' (దయ)

7. మంచి ముత్యము ఏ కార్తెలో మొదట పుట్టును? ఉ. 'స్వాతిని'

8. విష్ణువు ఏ అవతారమెత్తి సోమకాసురుని చంపెను? ఉ. 'మీనమై' (చేపయై)

1. ప్రతి ప్రత్యుత్తరంలోను మూడక్షరాలున్నవి. ఆ ప్రత్యుత్తరాల మొదటి అక్షరాలన్నిటిని వరుసగా కలుపగా వచ్చిన 'శ్రీరంగ నాయక స్వామి' మనలను దయతో రక్షించుగాక!

2. కొన్ని చరణాల ఆద్యక్షరాలు (పద్మ, పంక్తి....) ప్రత్యుత్తర సూచకములుగుట విశేషాంతరము.

## 37. నడిమి యక్షరాల్ ప్రత్యుత్తరాలు

పొంచుండి రాముడు గ్రుంకెను దేనిని?
శంభుండు గప్పిన శాలు వేది?
పూతనయై వచ్చి పొలియించె నెవ్వరి?
పెద్దరాతికి మారుపేర దేది?
చందురు జోతిపు ముందుగా గనిపించు?
జలజాక్షు చక్రమే చలువ నుండు?
ఫాలాక్షుతనయుని పక్షివాహన మేది?
హరి యేమియై పురా లవని గూల్చె?

అన్నిటికి జూడ మూడేసి అక్షరములు
నడిమ మాత్రల యందున నలరునట్టి
తిరుమలేశుండు నెప్పుడు స్థిరముతోడ
మనల కరుణావిధేయుడై! మనుచునుండు

ప్ర. 1. దొంగచాటుగా దాగి, రాముడు దేనిని చంపెను? ఉ. కో'తి'ని (వాలిని)
2. శివుడు కప్పుకొన్న చర్మము (శాలువా) ఏది? ఉ. (గజాసుర) చ'ర్మ'ము.
3. 'పూతన,యను రాక్షసి పాలిచ్చి ఎవరిని చంపెను? ఉ. (గొల్లవారి) బా'ల'ం.
4. పెద్ద బండరాతికి మరొక పేరేమి? ఉ. గ్రా'వేం'ద్రం (గ్రావ+ఇంద్రం)

5. చందమామ మొదట ఏవిధంగా కన్పిస్తుంది? ఉ. వం'క'ర
6. విష్ణుచక్ర మెట్లుండును? ఉ. వ'ట్రు'ము (గుండ్రంగా)
7. ముక్కంటి కొడుకగు కుమారస్వామి పక్షివాహనమేది ?
ఉ. నె'మ'లి
8. విష్ణువు భువిలో ఏ రూపమున త్రిపురముల దహించెను?
ఉ. బా'ణ'మై. కవి కాంక్షించినట్లు, ప్రత్యుత్తరాలన్నింటిలోను మూడేసి అక్షరాలున్నవి. ఈ ప్రత్యుత్తరాల మధ్యాక్షరాలను వరుసగా కలుపగా వచ్చిన 'తిర్మల వేంకట్రమణ'స్వామి మనల నందరిని, స్థిరంగా పోషించి, రక్షించునుగాక,

వి. దీనికి ముందున్న పద్యంలో, మొదట అక్షరాలను మాత్రమే కలుపగా, ఇక్కడ మధ్యాక్షరాలు కలుపబడినవి.

## 38. తల్లక్రిందౌచు పేరులు తనరుచుండు

వాలి సుగ్రీవుల వైర మేగతి గల్గె?
మందర యెవరితో పొందజెప్పె?
కొంకక హనుమడు లంక నేమిట గాల్చె?
కోరి కయ్యము నొడగూర్చు నెవడు?
ఇన సుతాగ్రజు జీరి యిలఁగూల్చు మృగమేది?
మహోగ్రధనుం డెవరితోడ గూలె?
కాంతలు తిలకమే చెంతను నుంతురు?
దశకంధరుడు సీత దాచె నెచట ?

అన్నిటికి జూడ మూడేసి యక్షరములు
తల్లక్రిందౌచు పేరులు దనరుచుండు
ఉత్తరంబులు వీనికి చిత్తమలర
తెలిసికొనరయ్య కవులార! తేటపడగ!

వీనికి ప్రత్యుత్తరాలన్నీ మూడక్షరాలలో నుండాలి. ఇక్కడ మరొక విశేష మేమిటంటే, మొదటి ప్రత్యుత్తరం చివర (తల) నున్న అక్షరం, తర్వాతి ప్రత్యుత్తరానికి ఆదిలో (మొదట) నుండవలెనుసుమా! కవులార! అట్టి వానిని మనసార తెలుసుకొని ప్రత్యుత్తరించండి.

ప్ర. 1. వాలి సుగ్రీవులను అన్నదమ్ములకు విరోధమేల గల్గెను ?
ఉ. తారకై ('తార' అను తరుణికోసమై)

2. మందర అను చెలికత్తె ఎవరితో నమ్మినట్లు చెప్పెను ?
ఉ. కైకతో.

3. హనుమంతుడు భయపడక లంకను దేనితో కాల్చెను? ఉ. తోకన

4. కావాలని కలహాన్ని కల్పించువాడెవడు? ఉ. నారదు (డు)

5. సూర్య పుత్రుడగు సుగ్రీవుని అన్న వాలితో పోరాడి, చచ్చిన దెవ్వరు? దుందుభి

6. స్త్రీలు బొట్టు నెక్కడ దిద్దుకొందురు? ఉ. నిటలం (నొసట)

7. దుర్యోధను డెవరిచే చంపబడెను? భీముని(తో)

8. రావణుడు సీత నెచట దాచెను? ఉ. లంకలో.

N. B. ప్రత్యుత్తరాలలో మూడక్షరాలే ఉన్నవి. ఒకటవ జవాబగు 'తారకై'లోని చివరి అక్షరం 'కై'. రెండవ జవాబగు 'కైకతో'లో మొదటి అక్షరమైనది. ఇట్లే, మిగిలినవానిలో గమనింపవలెను ?

39. నడుమ ముమ్మార్లు తెప్పుడు నలరు చంద్రు

భూతనాథుని సతి భూషణం బెయ్యది?
భువిలోన నెవ్వరు పూజనీయులు?
ఏ నామస్మరణచే నేగె ఖట్వాంగుండు ?
ఎగసి తృణావర్తు నెవడు కూల్చె?
జనకు కూతురు సీత జన్మించు టెక్కడ ?
గిరిరాజ నందిని గిత్తయేది ?
నరుని కాయము తీరు పరికింప నెయ్యది ?
పుడమిలో నూతులు పూడునెట్లు?

అన్నిటికి జూడ మూడేసి అక్షరములు
నడిమి మాత్రలు చూచిన నయముగాను
అలరు ముమ్మార్లు తెప్పుడు ననుదినంబు
మనల కరుణావిధేయులై మనుచు చంద్రు.

ప్ర 1. భూతేశుడగు శివుని భార్య యొక్క భూషణమేది? ఉ. తాం'బ్ర'ము (రాగిది)

2. భూమిలో పూజింపదగిన వారెవరు? ఉ. బ్రా'హ్మ'లు

3. ఏ పేరును జపిస్తూ ఖట్వాంగుడు వెళ్ళేను ? ఉ. గో'వి'ందా (అని స్మరిస్తూ)

4. తృణావర్తుడను రాక్షసునిపై దూకి చంపిన దెవరు? ఉ. కృ'ష్ణ'డు

5. జనకరాజు కూతురు సీతగా దేనిలో పుట్టెను? ఉ. క'మ'లం(లో.)

6. హిమవత్పుత్రిక పార్వతి వాహనమేది? ఉ. సిం'హే'ంద్ర

7. మానవుని శరీరవిధమెట్టిది ? ఉ. న'శ్వ'రం (నశించునది)

8. భువిలో నూతులెట్లు పూడుచున్నవి? ఉ. ఉ'ర్లు'ట (విరిగిపడుట)

అన్ని జవాబులలో మూడేసి అక్షరాలున్నవి. ఆ జవాబుల మధ్యాక్ష రాలలో పాఠణియున్న 'బ్రహ్మ-విష్ణు-మహేశ్వర్లు, మనలను మన్నింతురు గాక !

## 40. "ఒకటె రెండేసి ప్రశ్నల కుత్తరంబు!"

తే. ఇంటికిని వింటికిని ప్రాణ మేది చెపుము?
కంట మింటను మన మేమి కాంచ గలము?
నవ్వు, పువ్వు, దేనిని గూడి పొలుపుగాంచు?
ఒకటే రెండేసి ప్రశ్నల కుత్తరంబు! ॥
(ఉ. నారి, పాఖ, తారలు)

ప్ర 1. ఇంటిలోను, 2. ధనుస్సునకును, ప్రాణమువలె ముఖ్యమైనదేది?

1. ఉత్తరము : 'నారి', (భార్య/(స్త్రీ), అల్లెత్రాడు). ఇంటికి 'ఇల్లాలు'. ధనుస్సునకు 'అల్లెత్రాడు', మనిషికి ప్రాణంవలె ముఖ్యములైన వన్న మాట.

ప్ర 2. కంటిలోను(కంట), ఆకాశమునను (మింట)మనం ఏమిచూస్తాము?

2. ఉ. 'తార(లు)', మనం కంటిలో తారలను (కంటిలోని వల్లవి పాపలను), ఆకాశమున తారలను (నక్షత్రములను) చూడగలము.

3. నవ్వుగాని, పుష్పంగాని, దేనితో కలిసి అందంగా మండగలవు?

3. ఉ. 'వలపు'

1. పువ్వులో వాసన (వలపు)ను, 2. నవ్వులో ప్రేమ (వలపు)ను గాంచి మనం సంతసింపగలము.

వివరణ : మొదటి మూడు పాదాలలో, ఒక్కొక్క పాదానికి రెండు ప్రశ్నల చొప్పున, 6 ప్రశ్నలున్నవి. ప్రతి పాదంలోని రెండు ప్రశ్నలకు ఒకే ప్రత్యుత్తరం చెప్పబడినది. అనగా 1 వ పాదంలోని రెండు ప్రశ్నలకు 'నారి', 2 వ పాదంలోని రెండు ప్రశ్నలకు 'తార(లు)',

మూడవ పాదంలోని రెండు ప్రశ్నలకు 'పలుకు' నానార్థములతో ప్రత్యుత్త
రములైనవని గమనింపగలము.

## 41. "ఒక్కటే మూడు ప్రశ్నల కుత్తరంబు"

తే. కంటి కెయ్యది ప్రాణమై గ్రాలుచుండు ?
ఏది సంసారులకు సదా మోద మొసగు ?
ఆత్మ సంతతి హింసించు ప్రాణియేది ?
'ఒక్కటే మూడు ప్రశ్నల కుత్తరంబు' ॥ (ఉ. 'పాప')

1. ఈ పాప='కంటిపాప' కన్నులకు ప్రాణంగా ఉంటుంది. సంసారులకు 2. 'చంటిపాప'గా, సర్వదా సంతోషాన్ని కలిగిస్తుంది. 3. తన సంతానాన్ని తానే చంపివేసే ప్రాణి పాము.(పాప-పాము), 3. ఆ పాము తనకు పుట్టిన పిల్లలను (ఆకలి గొని) తానే తింటుందట ! ఇట్లే 'పులి' కూడ, ఈనినపుడు తన పిల్లలను తానే భక్షిస్తుందని ప్రసిద్ధి. కనుక ఒక 'పాప', పై 3 ప్రశ్నలకు ప్రత్యుత్తరము అయినది.

వి. 1. మనుష్యుల పిల్లలవలెగాక, ఇతర జంతుజాలము యొక్క పిల్లలు పుట్టగానే, నడయాడటం మొదలు పెడతాయి. ఈనినపుడు పులి, పాము మొ॥నవి, కన్నుగానక, ఆకలితో అలమటిస్తూ, దగ్గరగా దొరికిన తమ పిల్లలనే తింటాయట! ఈలోగా, దూరంగా తప్పించుకొని పోయిన పిల్లలు మాత్రం బ్రతుకుతాయి. కంటి మైకం, కాస్తంత తగ్గిన తర్వాత, ఇవి కూడ తమ పిల్లలను జాగ్రత్తగానే పెంచుతాయి.

2. ఇదొక సృష్టి వైచిత్ర్యం. లేకున్న, ఈ భూలోకమంతా, ఆ క్రూర జంతుజాలంతో నిండిపోయేదేమో?

3. పాప=కంటిపాప, చంటిపాప, పాము. (పాము + రేడు = 'పాప' రేడు)

**42.** "ఒకడు వచ్చి, యొకని మరుగేల చొచ్చెను?"

మామిడేల బూసె(చు) మండు వేసంగిని?
బాలుడేల బోయె(వు) పసుల వెంట ?
ఒకడు వచ్చి యొకని మరుగేల జొచ్చెను?
మాట కొక్క-మాట ముద్దుకృష్ణ! (ఉ. కాయనే)
రాజు సేన నేల రహిం జేర్చుచుండును? (పాఠాంతరము)

ప్ర. 1. మామిడిచెట్టు వేసవి కాలమున ఏల పూత పూసెను ? 2. బాలకుడు పశువుల వెంట ఎందుకు వెళ్ళెను ? 3. ఒకడు వచ్చి, వేరొకరిని,శరణము (రక్షణ) నేల కోరుకొనును? — (లేక ప్రభువు సైన్యము నెందుకు పెంచుకొనును?)

ఈ మూడు ప్రశ్నలకు "కాయనే" అనునది ఒక్కటే, నానార్థములతో ప్రత్యుత్తరమగుచున్నది.

ఉ. 1. మామిడిచెట్టు 'కాయనే' కాయలు కాయుటకే పూతపూసెను.
2. బాలుడు పశువులను 'కాయనే' కాయుటకే తోలుకొని వెళ్ళెను.
3. ఒకడు వచ్చి 'కాయనే' రక్షించుమనుటకే, మరుగు జొచ్చెను.
(లేక, ప్రభువు 'కాయనే' ప్రజలను, రాజ్యమును రక్షించి, పెంచుకొనుటకే, సైన్యమును పెంచుకొనును - అని పాఠాంతరమునకు భావము.)

వి. మొత్తము మీద, మూడు ప్రశ్నలకు, ఒక్క 'కాయనే' అనునది, నానార్థములతో ప్రత్యుత్తరమగుట - ఒక విచిత్ర చమత్కార విశేషము.

**43.** "మకరంబులు కూర్మరాజు మరుగున కరిగెన్"

క. మకర మొకటి రవి జొచ్చెను,
మకరము మరియొకటి ధనదు మాటున దాగెన్;

మకరాలయమున దిరిగెడు
మకరంబులు కూర్మరాజు మరుగున కరిగెన్॥
(భా. 9-144)

సందర్భము : గజేంద్ర మోక్ష సమయమున, పోతన కవి 'మకర' శబ్దాన్ని నానార్థాలతో చమత్కరించిన విధము :

వి. మకరము = (నానార్థములు—) 1. మొసలి, 2. మకర లగ్నము, 3. కుబేరుని నవనిధులలో ఒకనిధి, 4 మకర కుండలము మొ.

మొసలి కాటు నుండి, గజేంద్రుని కాపాడుటకై "సిరికిం జెప్పక ...." హడావిడిగా వచ్చిన విష్ణువు, ఆ మకరముపై, సుదర్శన చక్రము విడువ, ఆ మొసలి మరణించెను. అప్పుడే "మకర రాశి"లో సూర్యుడు ప్రవేశించెను. మరొక మకరము, కుబేరుని నవ నిధులలో నొకటిగా దాగెను, ఇక సముద్రమున (మకర+ఆలయమున) తిరిగెడు మొసళ్ళన్నీ సాగరము నందున్న "కూర్మావతారము" (=తాబేలు) యొక్క చాటునకు వెళ్ళి దాగినవట!

## 44. "శిరము లేదు గాని, నరుల బట్టుక మ్రింగు"

ఆ. కరయుగంబు గలదు, చరణంబులా లేవు,
కడుపు, వీపు, నడుము, మెడయు గలవు,
శిరము లేదుగాని, నరుల బట్టుక మ్రింగి,
సొగసు గూర్చు, దీని సొగసుగనుడీ॥ (ఉ. 'చొక్కా')

ఈ "చొక్కా"కు రెండు చేతులున్నవి. కాళ్ళు మాత్రం లేవు. పొట్ట, వీపు, నడుము, మెడ, అన్నీ ఉన్నవి, గాని "తల" మాత్రంలేదు. అయితేనేమి? ఆ చొక్కా, మనుష్యుల శరీరమునంతా కప్పి, (మ్రింగి) శోభను గల్గిస్తుంది. చూడండి.

**45.** "శిరహీనుడు నవ్వె నిట్టి చిత్రము గలదే?"

కరచరణంబులు గల్గియు,
కరచరణ విహీను చేత, గడు దుర్బలుడై,
జలచరుడు పట్టువడియెను,
శిరహీనుడు నవ్వె, నిట్టి చిత్రముగలదే?॥

(ఉ. కప్ప, పాము, ఎండ్రి)

చేతులు కాళ్ళు లేక నీటిలో దిరుగు (జలచరుడగు) కప్పను, చేతులు, కాళ్ళులేని పాము, పట్టుకొని లాగుచుండ, బలహీనమై బాధపడు చున్న కప్పను గాంచి, తలలేని ఎండ్రకాయ (శిరహీనుడు) నవ్వటం మొదలుపెట్టిందట! ఇట్టి చిత్రాన్ని ఎప్పుడైనా, ఎక్కడయినా చూచారా? ఎలాంటిదో?

**46.** తలపోయ ప్రాణముండదు"

క. తలయుండు, తోక యుండును,
తలవాకిలి యుండు, గనులు తప్పక యుండున్
తలపోయ బ్రాణ ముండదు,
తలకించును నరుల, దీని తత్త్వము గనుడీ!

(ఉ. పాము కుబుసము)

పాము విడిచిన కుబుసమునకు, తల, తోక కూడా ఉంటాయి. అల్లే నోరు (తలవాకిలి), కన్నులు కూడా తప్పక కన్పడతాయి. కాని తరచి చూస్తే ప్రాణం మాత్రం ఉండదు. అయితేనేమి? అది మనుష్యులను మాత్రం భయపెడుతుంది. కనుక, దాని సత్య స్వరూపమేదో సంభావించి చెప్పండి.

## 47. "లచ్చి శంకరుండు లలిమీర గలిసిన"

ఆ. లక్ష్మి శివుని గూడ లలిమీరగూడిన
భువనకారకుండు పుట్టవలయు
లచ్చి శంకరుండు లలిమీర గలిసిన
విష్ణుదేవుడుద్భవింప వలయు॥

ఎన్. బి. ఇదొక తమాషా పద్యం. పైకి అశ్లీలంగా, భ్రాంతి కలిగించి, మెదడుకు మేత సందిస్తుంది. ఏమిటీ సంకర్షమని ఎదిరింపక, నిదానంగా ఆలోచిస్తే, నిర్దిష్టమగు జ్ఞానోదయమై సంభోగ శృంగారం అపూర్వానందకరంగా, అవగతమౌతుంది. ఎట్లు ?

1. 'లక్ష్మి' = అనగా 'కమల'. ఈ శబ్దం లక్ష్మిని తెల్పు పర్యాయ పదము. శివుడు = భవుడు, పైన లక్ష్మికి పర్యాయ పదమైన 'కమల' శబ్దం తర్వాత, శివునికి పర్యాయ పదమైన 'భవుడు' పదాన్ని కలిపిన, 'కమల భవుడు' శబ్దం తయారై, దానికి అర్థమైన, భువన (లోక) సృష్టి కర్తయైన బ్రహ్మ (కమలము నుండి పుట్టిన వాడు) జన్మిస్తాడు. అప్పుడు అశ్లీల సంభోగార్థం సమసిపోతుంది.

2. అట్లే, లచ్చి-శంకరులు కలిసిన (సంభోగించిన ?) పైన చెప్పినట్లు 'బ్రహ్మ'యే గాక, విష్ణుమూర్తికూడా, పుడతాడట! ఎట్లు ?

'లచ్చి' శబ్దానికి పర్యాయపదం 'రమా' అనునది కాగా, శంకర శబ్దార్థాన్ని తెల్పేది 'ఈశ' పదం. ఇపుడు ఈ రెండు 'రమా+ఈశ' అను పదాలను కలిపిన 'రమేశ' పదం తయారై "విష్ణుదేవుడు" అనే అర్థాన్ని వివరిస్తుంది.

వి. అశ్లీలమని, అస్పృశ్యమని, తొందరపడి నిందింపక, నిదానంగా ఆలోచిస్తే, కొంచెం డొంక తిరుగుడుగానైనా, అసలు యథార్థమైన

అర్థమంతా అర్థమై, "ఓహో ఇదా! అని అమితానందాన్ని అందిస్తుంది. అదొక వినోద సాహిత్య వైచిత్ర్యం.

## 48. 'మామకు మామయైన పరమాత్ముడు'

1మామను సంహరించి, యొక2మామకు గర్వమడంచి, యన్నిశా
3మామను రాజు జేసి, యొక4మామ తనూజునకాత్మబంధువై
5మామకు గన్నులిచ్చి, సుతు మన్మథు శత్రికి దానె6మామయై
7మామకు8మామయైన పరమాత్ముడు మీ (మా)కు బ్రసన్నుడయ్యెడున్॥

సం. ఇది యొక విచిత్ర విష్ణు ప్రార్థన. దీనిలో ఒకరిద్దరు కాదు. ఎనిమిది మంది 'మామ'లున్నారు. వారినందరిని వెదకి పట్టుకొని, వారెవరో గుర్తింపవలెను. ఈ పద్యంలో అనేకావతారాలు, పూర్వగాథలు కూడా పునర్దర్శన మిస్తాయి

1. మామను = 'కంసు'డను మామను, సంహరించి = చంపిన, 'కృష్ణుడు', 2. ఒక మామకు- గర్వమడంచి = ఒక మామయైన 'సముద్రుని' మదమును, రామావతారంలో సేతువు గట్టి అణగగొట్టి, లేక, శమంతక మణికై మామయగు జాంబవంతునితో పోరాడి, వాని మద మణచిన కృష్ణుడు, 3. ఆ- నిశామామను-రాజు చేసి = రాత్రులందు వెలుగొందు చంద'మామ'ను రాజుగా చేసి, ('రాజన్' శబ్ద నానార్థములలో 'చంద్రా'ర్థ మొకటి), 4, ఒక 'మామ' - తనూజునకు - ఆత్మ బంధువై = ఒక మామ 'పాండురాజు' (తన అత్త కుంతికి భర్త) కొడుకు (అర్జునుడు)కు (కృష్ణావతారమున) ప్రాణమిత్రుడై, (కృష్ణావతారమున, నరనారాయణులు (అర్జున, కృష్ణులు ప్రాణమిత్రులుగా ప్రసిద్ధులు) 5. మామకు - కన్నులిచ్చి = (రాయబార సందర్భమున, తనను కట్టివేయుటకు వచ్చిన, దుర్యోధనాదులకు, తన 'విశ్వరూపము'ను చూప,

మూర్ఛితుడు కాగా, మామ పాండురాజుకు అన్న, గ్రుడ్డి వాడగు ధృతరాష్ట్రుని (ప్రార్థనపై) ఆ మామ ధృతరాష్ట్రునికి కన్నులను ప్రసాదించి, చూపించి, 6. కొడుకగు 'మన్మథు'నికి భార్యయైన 'రతిదేవి'కి తానే, స్వయంగా మామయై, 7. సముద్రమును చిలికినపుడు, దాని నుండి పుట్టిన 'లక్ష్మి'ని వివాహ మాడిన విష్ణువునకు, సముద్రుడు 7వ మామయయ్యెను. అట్లే గంగ విష్ణుపాదముల నుండి పుట్టి విష్ణువునకు కూతురైనది. ఆ గంగకు భర్త 'సముద్రుడు'. కనుక, పూర్వం లక్ష్మినిచ్చి, మామయైన సముద్రునకు, తర్వాత తన కూతురైన గంగనిచ్చి, ఆ సముద్రునకు, తానుకూడ మరల 8వ మామ యయ్యెను.

ఇట్లు ఎనిమిది విధాలుగా మామలకు మర్యాద చేసి, 'మామ'యైన విష్ణు భగవానుడు సంతుష్టుడై, మనల నందర ననుగ్రహించుగాక!

వి. పద్యంలో, పలు-అవతారాలు, పూర్వగాథలు కూడా, స్మృతి పథమున ప్రవేశించి, స్పష్టము లైనవి.

## 49. 'నలుగురు బలికిరి — నరి'యని

క. నలు గురు బలికిరి 'సరి'యని
1'నలు2గురు3బలికిరి' 1సురూప–2నయ-3దాన4ధరా
వలయధురాచరణోన్నతి
పొలుపున గద్వాల సోమభూపాలునకున్॥

కవిపండిత పోషకుడగు 'గద్వాల' 'సోమ భూపాల వర్ణన'.

1. మంచి అందము 2. నీతిశాస్త్రము 3, ఈవి (ఇచ్చుట) 4. భూగోళ భారము. అను వీనిని అధికంగా ఆచరణలో పెట్టుటలో, గద్వాల సంస్థానాధీశుడగు సోమ భూపాలునికి, వరుసగా 1. నలు, 2 గురు, 3 బలి, 4 కిరి = (అనగా) 1. నలమహారాజు, 2. దేవగురువగు బృహస్పతి, 3. బలి చక్రవర్తి 4. వరాహ (పంది) అవతారములతో, పోలు

పగా = పర్యాయగ, ఆనందముగ, సరి-అని = సమానంగా పోల్చదగిన వారు-అని, నలుగురు – బలికిరి = ఆస్థాన ప్రజలు అందరూ ఏకగ్రీవముగా పలికినారని భావం.

దీనిలో, 'నలుగురుబలికిరి' పునరుక్తితో, శ్లేషతో, నానార్థములు చెప్పబడుట విశేష విచిత్ర విషయము.

N. B. ఈ పద్యమే కొంచెము మెరుగుపెట్టబడినదై, 'కచ్చి రంగయ్య' అను దాతను గూడ వర్ణించినట్లున్నది.

## 50. 'నలుగురు నిను బలుమారున్ – గెలిచిరి

క. 1నలు2గురు3నిను4బలు5మారున్
గెలిచిరి 1సుగుణో2క్తి 3 కాంతి4కీర్త్యా 5కృతులన్
నలుగురు నిను బలుమారుల్
భళి! భళి!యన కచ్చిరంగ! భాగ్యతరంగా!॥

సౌభాగ్యతరంగా! కచ్చి రంగ! 1. సుగుణ + 2 ఉక్తి, 3. కాంతి 4. కీర్తి + 5 ఆకృతులన్ = 1. సద్గుణములలో, 2. మంచిమాటలు చెప్పుటలో, 3. చక్కదనములో, 4. యశస్సంపాదనలో, 5. ఆకారములో క్రమంగా, 1 నలున్, 2 గురున్, 3 ఇను, 4 బలు, 5 మారు(ల)న్ = 1 నలచక్రవర్తిని, 2 బృహస్పతిని, 3 సూర్యుని, 4 బలరాముని, 5 మన్మథుని, గెలిచితి = గెలిచినావు, (అని) నలుగురు - నిను - పలుమారుల్ - 'భళి! భళి!' - అన = అనేకులు - నిన్ను - అనేకసార్లు - 'భళి! భళి!' అను ధ్వనులతో నుతించిరి సుమా! అని భావం.

2. పద్యంలో పునరుక్త్యాభాసముల్నా, శ్లేషతో, క్రమంగా అర్థాంతరాన్వయం అత్యంత చమత్కార జనక మైనది గదా-

## 51. జ్యోతిశ్శాస్త్ర – చమత్కారములు

కేవల పదాలవలననే గాక, శాస్త్రాంతరాధ్యయన, పరిచయ లోపం

వలన కలిగిన దుర్యోధార్థాలను, కూడ దండి మహాకవి 'ప్రముషితా' ప్రహేళి (१) కాన్తర్గతములుగా ప్రవంచించెను.

క. నక్షత్రము గల చిన్నది
నక్షత్రము చేతబట్టి, నక్షత్ర ప్రభున్।
నక్షత్రమునకు రమ్మని
నక్షత్రము పైనవేసి, నాధుని పిలిచెన్॥

సం. 'ధర్మజుని సజీవముగ బట్టి తె'మ్మని కోరిన దుర్యోధనునకు, 'అర్జునుని లేకుండ చేసిన, ఆ పని చేయగల'నని ద్రోణాచార్యుని సమాధానము, కాగా, దుర్యోధనుడు 'సంశప్త'కులను ప్రార్థించి, వారితో బోరు నెపమున, అర్జునుని దూరముగా పంపెను. వెంటనే ద్రోణుడు 'పద్మ వ్యూహము'ను పన్ని, ధర్మజు నాహ్వానింప, వ్యూహభేదనము తెలియక, ఇరుకునబడిన దర్మరాజాదులు, గత్యంతరములేక, అభిమన్యుని పద్మ వ్యూహ-భేదనమునకు పంపు ఘట్టమున, 'ఉత్తర' భర్తకు వీరతిలకము దిద్దుట.

2. ఈ పద్యము జ్యోతిశ్శాస్త్ర సంబద్ధము. తదనుసారముగ, ముఖ్యము అగు 'అశ్విని' మొదలగు 27 నక్షత్రములను గుర్తుంచుకొని, పద్యార్థమును ప్రకటింపవలెను.

నక్షత్రము గల చిన్నది=దీనికి నక్షత్రమని అర్థం చెప్పరాదు. (ఉత్తర అభిమన్యుని భార్య, విరాటరాజు కూతురు). 'ఉత్తర' అను నాయిక, నక్షత్రము చేతబట్టి=భరణి (నక్షత్రంకాదు, కుంకుమభరణి)ని–చేతితో పట్టుకొని, నక్షత్ర ప్రభున్=(నక్షత్ర ప్రభువగు చంద్రుడు-రాజు) అనగా - చంద్రవంశజుడు, తనకు భర్తయగు అభిమన్యుని, నక్షత్రము నకు - రమ్మని=(నక్షత్రం కాదు) మూల (ఒకవైపు)కు–రమ్మని చెప్పి, నక్షత్రము-పైనవేసి='హస్త'ము (చేతిని) అతనిపై వేసి, (ప్రేమతో,

రూపకాలంకారముతో), నాథుని-పిలిచెన్=భర్తయగు అభిమన్యు నాహ్వానించి, వీరతిలకము దిద్దెను.

వి. 1. మొత్తంమీద, నక్షత్రములనగా— 'ఉత్తర, భరణి, మూల, హస్త' అనేవి, వాని అర్థాలు జ్యోతిశ్శాస్త్ర పరిచయము లేనివారికి దుర్బోధములు.

2. పదములు మిక్కిలి దూరంగా నుండుట వలన, అర్థావబోధనలో కష్టాన్ని కల్గించేది 'ప్రముషిత' ప్రకర్షంగా బుద్ధిని మోసం చేయుట వలన ఇది 'ప్రముషితా' ప్రహేలికే.

("సా స్యాత్ 'ప్రముషితా' యస్యాం దుర్బోధార్థా పదావళీ" అని దండి మహాకవి.)

3. 'వంచితా' అను 'ప్రహేలిక'లో ఒకే పదము దుర్బోధార్థము గలది అగుచుండగా, ఇక్కడ, అనేక పదములు దుర్బోధార్థములుగా నుండుటను విశేషము గమనార్హము.

4 ఈ పద్యమునకు 'తారాశశాంకుల ప్రణయలీల'లకు, ఉదా: గా, మార్చి 1948 'భారతి' మాసపత్రికలో శ్రీ తిమ్మావజ్ఝల కోదండరామయ్య గారు వ్యాఖ్యానించిన విధానము కూడ ప్రశంసార్హమే.

5. మరియు, 'నక్షత్ర' పదం, 4 పాదాలలో నుండుటను బట్టి, శ్రీ కోదండరామయ్య 'దత్తపది'గా కూడ భావించి, వ్యాఖ్యానించిన — పాఠాంతరం :-

### 5 ఆ. "నక్షత్రము బట్టి యీడ్చె"

నక్షత్రము పేరిటి నతి  
నక్షత్ర సుఖంబు గోరి నక్షత్రేశున్,  
నక్షత్రమునకు రమ్మని  
నక్షత్రము బట్టి యీడ్చె, నగిరొ ప్రియమునన్॥

అర్థం : నక్షత్ర....సతి = నక్షత్రార్థకమగు పదం పేరుతో గల 'తార' (=బృహస్పతి భార్య), నక్షత్ర....గోరి=ఆశ్లేష (కౌగిలింత) వలని సౌఖ్యమును గోరి, ('ఆశ్లేష' ఒక నక్షత్రము, ఆలింగ నార్థమిచటలా క్షణికము), నక్షత్రేశున్=నక్షత్ర ప్రభువగు చంద్రుని, నక్షత్రమునకు= 'మూల'కు, రమ్మని, నక్షత్రము-పట్టి = 'హస్త'ముతో - పట్టుకొని, ప్రేమతో లాగి, ప్రౌఢాంగన గనుక, నవ్వినదట!

వి. యౌవన గర్వితయగు 'తార', దొరికిన యవకాశమును వదల లేక, ప్రారబ్ధ యౌవనుడగు చంద్రుని 'ఆశ్లేష'మును (ఆలింగనము) గోరి, ఇతరులకు దెలియకుండుటకై, 'హస్త'ముతో బట్టి, 'మూల'కు రమ్మని లాగి, ప్రేమతో నవ్వి, చంద్రు న్మదేకపరచి, లోబరచుకొనగోరినదని భావము.

ఒకచో, వాక్యార్థము తన వాస్తవికార్థాన్ని కోల్పోయి, తద్భిన్నంగా అర్థాన్ని కల్పించి, భాసింపజేసినచో, అది 'ప్రకల్పితా' అను ప్రహేళిక ఔతుంది.

## 53. "నీ వేలా కరుణింపవోసి వృద్ధా! నన్నున్"

క. రాలు వడెడు మాటలతోఁ,
వాలిన తలతోను, దైన్యపు చూపులతోన్,
దూలుచు నిలబడినను, నీ
వేలా కరుణింపవోసి! వృద్ధా! నన్నున్॥

ఓ ముసలిదానా! (వృద్ధా!) గద్గదకంఠంతో, తలవంచి, దైన్య దృష్టితో, వణకుచు, నీ యెదుట నిల్చినను, నన్ను కరుణింపవేల? అని యొక కాముకుడు, వృద్ధురాలిని ప్రార్థించినట్లు, ఒక భిన్నార్థం, పైకి భాసింపజేయబడుతోంది.

కాని, వాస్తవికార్థ మేమనగా, వృద్ధా=ఓ లక్ష్మీదేవీ! దారిద్ర్యం

వలవి తొట్రుపాటు స్వరంతో, భక్తితో వంగిన శిరస్సుతో, దీనదృష్టితో, వణకుచు, నీ దరిజేరి ప్రార్థించినను, నన్నేల కరుణింపకున్నావు?- అనేది మాత్రమే.

మొదటి అర్థం, వివక్షితార్థానికి విరుద్ధంగా భాసించుటచే, పైకి 'విరోధాభాసము' కన్పించినను, 'వృద్ధా' శబ్దానికి 'లక్ష్మి' అనే అర్థాన్ని ప్రకల్పించి, సమన్వయించుటచే, ఇది 'ప్రకల్పితా' అను ప్రహేళిక యైనది.

కొందరు, దీనిలో 'విరోధాభాసము'ండుటచే, దీనివలె, అపశబ్ద, అశ్లీలాభాసములను కూడ 'ప్రహేళిక'లలో చేర్చి, చెప్పినారు.

## 54. 'వేధవేధాంత' విద్యలు వేవిధములు

1. అపశబ్దాభాసము :

తే. వేధవేధాంత విద్యలు వే విధముల
తెలిసి సర్వోత్తమత్వ ప్రతిష్ఠ నీకె॥ వే.ల.స.

దీనిలో 'వేధ-వేధాంత' శబ్దాలు మొగట వినగానే, అపశబ్దాలుగా పైకి కన్పడతాయి. కాని, వేధ=బ్రహ్మ, వేధ+అన్త - విద్యలు=బాధను నాశనం చేయు - విద్యలు — అనెడి అర్థంలోనివి 'సుశబ్ద'ములే అగు చున్నవి.

## 55. లంజెరాగ సరసకుం జవరాలు చేరి

2. అశ్లీలాభాసము :

ఆ. లంజెరాగ సరసకుం జవరాలు చేరి
ముద్దులాడి, హార్ద ముగ్ధ కేళి
శాలలోన బయల చంద్రకాంతుల గ్రామ
విహృతి నెరపు పెద్ద వేంకటపతి॥ విక్రాల.వేం.చి.

వి. పద్యంలోని 'లంజ రాగ సరసకు జేరి, ముద్దులాడి.... వేంకటేశ్వరుడు కామక్రీడలు సలుపుచున్నా'డను అర్థం 'అశ్లీలము (ఏవగింపు)'గ నున్నది.

'లంజ' శబ్దము, మొదట 'జంకుటాలు, కులట' అను అర్థాన్ని బోధించి, అశ్లీలాభాసము'గ పైకి కన్పడినను, నానార్థకల్పనతో 'లంజ'కు 'లక్ష్మి' అను అర్థాన్ని గమనించినపుడు, సుశబ్దమేయగును.

"పరిహారిక:—రూఢపదాలను వదలి, కేవల వ్యుత్పత్తి లభ్యము లగు యౌగిక శబ్దపరంపరతో, ఇష్టార్థాభివ్యక్తిని గల్గించినచో, అది 'పరిహారికా'యను ప్రహేలిక యగును.

## 56. పాదహతిని ఖిన్నుడైన జనుడు

ఆ. శకున జిత తనూజ శాత్రవ గురుపాద
హతిని, ఖిన్నుడైన యట్టి జనుడు,
హిమ విరోధ్య మిత్రదములచే వ్యాప్తమౌ
ఘన పథమును మెచ్చుకొనుచు నుండు . (చ. కా. 121)

అర్థము: శకున=పక్షియైన గరుత్మంతునిచే, జిత=జయింపబడిన (జనుడు) ఇంద్రుడు, అతని తనూజుడు=అర్జునుడు,వానికి, శాత్రవ=శత్రువగు కర్ణుడు, వానికి గురువు (తండ్రి)=సూర్యుడు, వాని, పాద-హతివి =ఆ—సూర్యకిరణముల-తాకిడిచే, ఖిన్నుడైన-జనుడు=ఎండవేడిమిచే బాధపడి దుఃఖించువాడు, హిమ—విరోధి=మంచుకు-శత్రువు=అగ్ని, దానికి, అమిత్ర(ము)=శత్రువు, నీరు, దానిని, 'ద'=ఇచ్చునవి=మేఘములు, వానిచే, వ్యాప్తమైన, ఘన—పథమును=మేఘమార్గమును-ఆకాశమును, అనగా-సూర్యకర సంతప్తుడగువాడు, మేఘవ్యాప్తమగు ఆకాశమును, (చల్లగ నుండుటచే), మెచ్చుకొనుచున్నాడని భావము.

ఈ పద్యంలో వ్యుత్పత్తి లభ్య-యౌగిక శబ్ద పరంపరతో, శిరోవేష్టనప్రాణాయామంతో, ఆలస్యంగా, అభీష్టార్థాభి వ్యక్తి కల్గినది, కాని,

దీనిలోని 'రూఢ, యోగరూఢ' పదాలను పరిహరించుట చేత ఇది 'పరిహారిక' అను ప్రహేలిక గూడ అగుచున్నది

మరొక ఉదాహరణమును, మరువకుండా పరిశీలించండి.

## 57. 'సున్న మిప్పుడు తేగదే సుందరాంగి'

తే. గీ. పర్వత శ్రేష్ఠపుత్రికా పతి విరోధి
అన్న పెండ్లాము అత్తను గన్న తండ్రి,
ప్రేమ వారింట పెరిగిన పెద్దబిడ్డ!
సున్నమిప్పుడు తేగదే సుందరాంగి!

పర్వత శ్రేష్ఠపుత్రికా=శ్రేష్ఠహిమవంతుని (మేలైన) కూతురు, పార్వతి, ఆమెకు పతి=భర్త-శివుడు, ఆతని, విరోధి=శత్రువు-మన్మథుడు వాని, అన్న=బ్రహ్మ, వాని పెండ్లాము=బ్రహ్మ భార్యయగు సరస్వతి, ఆమె అత్త=లక్ష్మి, ఆమెను, కన్నతండ్రి=సముద్రుడు, వాని పెద్దబిడ్డ =జ్యేష్ఠాదేవి=దరిద్రదేవత, లేక పెద్దమ్మ. ఓ దరిద్రపుగొట్టు పెద్దమ్మా! సున్న మిప్పుడే కొంచెం తెచ్చి, ఇమ్మని, ఒక వికటకవి, లేక కాముకుడు, ఒక వెలయాలిని (బోగసు దానిని) హెచ్చరించెను.

ఆమె మాత్రం తక్కువ తిన్నదా? పూర్వపు వెలయాండ్రలో విద్యలు నేర్చిన రసికురాండ్రెందరో ఉండెడివారట! అందుచే ఆవేశ్య,అంత కంటే దురన్వయం, దురాన్వయంతో:-

## 58. సుతువాహన వైరి వైరి సున్నంబిదిగో!

క. శతపత్రంబుల మిత్రుని
సుతు జంపిన వాని బావ సూనుని మామన్,
సతతము తల ధరియించిన
సుతవాహన వైరి వైరి! సున్నం బిదిగో॥

శతపత్రంబుల (పద్మాలకు) మిత్రుడు=సూర్యుడు, అతని సుతుడు =కర్ణుడు, వాని జంపినవాడు,అర్జునుడు,వాని బావ కృష్ణుడు,వాని సూనుడు (కొడుకు) మన్మథుడు. అతని (మేన)మామ=చంద్రుడు, అతనిని, తల(ను) ధరించినవాడు=శివుడు, వాని సుతుడు=వినాయకుడు, వాని వాహనం=ఎలుక, దానివైరి=శత్రువు=పిల్లి. మరల దానివైరి=కుక్క, ఓరీ కుక్కా! సున్నం బిడిగో(రా!) అని పిల్చి, సున్నమిచ్చి, ఆ వికట కవి, కాముకుని, వెంగలివిత్తు (మూర్ఖుడు)ను చేసి, చిత్తుచేసిన దట!

వి. కొందరీ పద్యాలను 'బావ - మరదళ్ళ'కు సమన్వయిస్తారు. మొత్తం మీద దీనిలో, సంస్కృత - దండి మహాకవి చెప్పిన 'పరిహారికా' అను ప్రహేలిక ప్రస్ఫుటమౌతోంది.

ఈ 'శత పత్రంబుల....' పద్యానికి క్రింది పాఠాన్తరమువలె ఉన్నదానినికూడ పరిశీలించండి.

## 59. "సతతము తల దాల్చెడి దొర"

క. శతముఖునతి యగు శచికిని
సుతుడగు, వాని పినతండ్రి సూనుని మామన్,
సతతము తల దాల్చెడి దొర
సుతు వాహనవైరి వైరి! సున్నం బిదిగో॥

నూరు యాగాలుచేసిన దేవేంద్రుని భార్య-శచీదేవికి పుత్రుడు = జయంతుడు, వాని పినతండ్రి=ఉపేంద్రుడు (విష్ణువు), వాని కొడుకు= మన్మథుడు, అతని మామ చంద్రుడు, అతనిని తలపై ధరించిన దొర= శివుడు, అతని సుతుడు = వినాయకుడు, వాని వాహనం=ఎలుక, దానికి వైరి = విరోధి-పిల్లి, ఆ పిల్లికి వైరి = కుక్క, ఓకుక్కా! ఇదిగో,సున్నం తీసుకో! - అని.

ఇక్కడే, ఒక నెరజాణ, తన కూతురు లేక మనుమరాలి కొరకై వచ్చిన యొక విటుని ఎరుకపరచుచు, చెప్పిన మాటలు :-

**60. ... తగు వాహనమైన యట్టి ధన్యుం డితడే !**

క. 1నగ పగతు పగతు 2 పగతుని
3 పగతుండగు మగధరాజు బరిమార్చిన ఆ
జగజెట్టి యన్న తండ్రికి
దగువాహనమైన యట్టి ధన్యుం డితడే !

1 నగ-పగతుడు = పర్వత-విరోధి-ఇంద్రుడు, అతని విరోధి = నరకుడు, 2 వాని విరోధి = కృష్ణుడు, 3 అతని విరోధి జరాసంధుడు (మగధరాజు) అతనిని పరిమార్చిన (చంపిన) జగజెట్టి = భీముడు, వాని యన్న ధర్మరాజు, అతనికి తండ్రి = యముడు, అతనికి వాహనమైన యట్టిది=దున్న, అట్టి ధన్యుడు (మూర్ఖుడని లాక్షణికార్థం) ఇక్కడ, ఎదురుగానున్న విటుడే సుమా ?

అనగా-ఇతడు వట్టి "దున్నపోతు" సుమా! అని పద్య భావం.

**61. "పద్దుగ నుత్తరము లిండె పడయంగా నా"**

క. ఎద్దీశున కశ్వంబగు ?
గ్రద్దన నే దడవి దిరుగు ఖరకంటకియై?
హద్దుగ నేవాడు ఘనుడు ?
పద్దుగ నుత్తరము లిండె పడయంగా నా॥

ప్ర 1. ఎద్ది+ఈశునకు, అశ్వంబు+అగు = ఏది-ఈశ్వరునకు-వాహనము అగును? — అని 'ఇత్వ' సంధితో ప్రశ్నింప, ఉ. ఎద్దు+ఈశునకు - 'అని ఉత్వసంధి'తో విడగొట్టి, 'నంది' (ఎద్దు) శివునకు వాహనమని ప్రత్యుత్తరం.

2. ఖరకంటకిమై-గ్రద్దన-ఏది+అడవిన్-తిరుగు ? = గట్టిముళ్ళు గలదై, త్వరగా, ఏ జంతువు-అడవిలో తిరుగును ? అని రెండవ ప్రశ్న. కాగా, ఏదు+అడవిన్-తిరుగు=ఏదు పంది (గట్టి ముళ్ళుగల పంది) అడవిలో తిరుగును - అని ప్రత్యుత్తరము.

3. హద్దుగన్-ఏవాడు-ఘనుడు? = ఏ మేరకు-ఎవడు- గొప్పవాడు (అగును?) అని ప్రశ్నకాగా, ఉ. హద్దున్ - కనేవాడు—ఘనుడు=తన పరిమితిని లేక ఎల్లను-తెలిసికొని, నడచుకొనువాడే-గొప్పవాడు.

వి. 1. ఈ మూడు ప్రశ్నలు, వానికి ఉత్తరాలుకూడ, ఈ పద్యములోనే ఉన్నవి.

2. దీనికి, అడిదం సూరకవి 'ఉత్తరాలంకార' ఉదాహరణగా పాఠాంతరమును ఇచ్చెను.

## 62. కృషికు లెద్దాని వాంఛింతు రెల్లయప్డు

ఎద్దీశున కశ్వంబగు ?
కృషికు లెద్దాని వాంఛింతు రెల్లయప్డు ?
విడెము నెద్దాన నొక్కంగ గడగు నరుడు ?
'వంట'నని యుత్తరము చెప్పువాడ సఖుడ !

ప్ర 1. ఎద్ది+ఈశునకు-అశ్వంబు+అగు? = ఏది - ఈశ్వరునకు వాహనము? అని ప్రశ్నకాగా, 'ఎద్దు-ఈశునకు-అశ్వంబగు'నని అదియే జవాబు.2. కృషికులు-ఎల్లయప్డు-ఎద్దానిన్-వాంఛింతురు? = రైతులు-ఎల్లవేళల-దేనిని-కోరుకొను చుందురు?

3. నరుడు—విడెమున్-ఎద్దానన్-నొక్కంగన్ - కడగు? = మానవుడు — వక్కాకు (తాంబూలము) ను - దేనితో - నొక్కినమలుటకు -

ప్రయత్నించును? ఉ. ఈ 2, 3 ప్రశ్నలకు - సఖుడ ! 'పంటన్' - అవి ఉత్తరము-చెప్పువాడ=మిత్రమా! (నీ వడిగిన 2, 3 ప్రశ్నలు రెండింటికి కలిపి) 'పంటన్=పంటితో' అను ఒక్కదానితోనే, ప్రత్యుత్తరముగా-చెప్పుచున్నాను సుమా ! 2. రైతులెప్పుడు 'పంటన్' = ఎప్పుడు తమ పైరు బాగుగా పండునా? అని, ధాన్య సమృద్ధిని గోరుచుందురు. 3. మానవుడు, పంటన్ = పంటితో=దన్తముతో, తాంబూలమును కొరికినమలును.

ఐ. సూరకవి ఉదాహరణలో 1వ ప్రశ్నకు ఒకటే సమాధానము, కాగా, 2, 3 ప్రశ్నలకు ఒక్కటే జవాబగుట విశేషము. చంద్రాలోక-ఉత్తరాలంకార-ఉదాహరణమగు "(కేదార పోషణరతాః ?) కేఖేటాః ? కిం చలం? వయః"=1. ఆకాశమున సంచరించునవి ఏవి ? 2. చంచలమైనది ఏది? - అను ఈ రెండు ప్రశ్నలకు 'వయః'( = పక్షులు,వయస్సు) అనునది ఒక్కటే సమాధానము. లింగ, వచన భేదంతోనున్న 'వయః' అను సంస్కృత పదం, ఆంధ్రీకరణకు అంకెకు రాకపోవటం చేత గాబోలు, సూరకవి ఇక్కడ "పంటన్" అను ప్రత్యుత్తరాన్ని చక్కగానే సంబద్ధం చేసినాడు.

63. తలుపుమూల నుండు తలమీద నుండును.

వంగతోటనుండు, పరిమళ్ళలో నుండు,
జొన్నచేల నుండు, చోద్యముగను,
తలుపుమూల నుండు, తలమీద నుండును,
దీనిభావ మేమి? తిరుమలేశ!

వంగతోటలో, పరిమళ్ళలో, జొన్నచేలలో, తలుపుమూల, తలమీద ఉండునవి ఏవి? అని, అన్నీ ప్రశ్నలే. ఇవి భ్రాంతిని గల్గించి, చిత్తాన్ని చిక్కుల్లోకి తోసి వేస్తున్నాయి. దీని రహస్యం పదవిభాగం లోనే ఉన్నదని తెలుసుకొంటే, ఇంకేముంది? అర్థం అత్యంత సులభమై

ఆనందాన్ని అందిస్తుంది. ఎట్లు? ఇక్కడ వంగతోట, వరిమడి....మొ॥నవి సమస్తపదాలుకావు. నిర్దాక్షిణ్యంగా వాటిని ఛేదించాలి. అప్పుడు-

1. వంగ—తోటన్—ఉండు=వంగ చెట్టు తోటలోనే ఉంటుంది.

2. వరి—మళ్ళలోనే-ఉండును. 3. జొన్న—చేలనే—ఉండును,—మరియు తలుపు ఒక మూలలోను, తల (శిరస్సు) పై భాగము (మీద)నను ఉండు నని గ్రహిస్తే, కష్టమేముంటుంది? ఈ క్రింది పద్యాన్నికూడ ఇంకొంచెం శ్రద్ధగా పరిశీలించండి.

## 64. "బ్రాహ్మణుండు కాకి పలలము తిను"

కొండ నుండు నెమలి కోరిన పాలిచ్చు
పశువు శిశువు తోడ పలుక నేర్చు
వనిత వేదములను వల్లించుచుండును
బ్రాహ్మణుండు కాకి పలలము దిను।

కొండమీది మిన్న నెమలి కోరినన్ని పాలివ్వడం, పశువు శిశువుతో పల్కడం, వనిత (స్త్రీ) వేదాలను వల్లించడం, బ్రాహ్మణుడు కాకి మాంసం తినడం—ఈచోద్యం ఎక్కడైనా,విన్నామా? కన్నామా? అని, కళ్ళెర్ర జేసి కారాలు మిరియాలు నూరగూడదు. పూర్వం మనకు 'విరామచిహ్నాలు' లేవు, వానిని, పెట్టుకొనాలి. లేక చదివేటప్పుడు జాగ్రత్తగా, పదవి భాగ పురస్సరంగా, ఛేదించి చదివినా, ఈ బాధరాదు. ఎందువలన? పరిశీలించండి. 1. కొండన్ ఉండు నెమలి 2. కోరిన పాలిచ్చు పశువు, 3. శిశువుతోడ వనిత పలుకనేర్చు, 4. బ్రాహ్మణుండు వేదములను వల్లించు చుండును, 5. కాకి పలలము (మాంసము) తినును. ఇలా విభజించుకొంటే, అర్థం ఎంత సులభంగా ఉంటుంది.

## 65. "దీని యర్థమేమి తిరుమలేశ?"

ఆ. వె. మూడు శిరములుండు, మొదమొప్ప పదికాళ్ళు,
శరములుండు రెండు, కన్నులారు,

కొమ్ములెన్న నాలుగును, తోకలు రెండు,
దీని యర్థమేమి తిరుమలేశ!

2. ఉ. ఎడ్లబండి లేక నాగలిదున్నే రైతు.

ఒక బండికి లేక నాగలికి, రెండు ఎడ్లను కట్టినపుడు, ఎడ్లతలలు రెండు, బండి, లేకనాగల్ని నడుపు వాని తలఒకటి, మొత్తం $(2+1=3)$ మూడు తలలు (శిరస్సులు) ఉండును. రెండు ఎడ్లవి $2\times 4=8$ కాళ్ళు,+ మనిషికాళ్ళు రెండు, మొత్తం $(8+2=10)$ పదికాళ్ళుండును. మనిషికి చేతులు (కరములు) రెండున్నవి. రెండెడ్లకు కన్నులు$(2\times 2=4)$నాలుగు +మనిషివి రెండు, మొత్తం ఆరు కన్నులున్నవి. రెండెడ్లకు కొమ్ములు $(2\times 2=4)$ నాలుగు, తోకలు రెండు ఉన్నవి — అని సమాధానము.

## 66. "మనుమరాలు తాకిన రూపె మార్చుకొనును."

మూడు తరములకును తానె మూలమౌను,
తీయగా నింటి పులికి నాతిథ్యమిడును,
మనుమరాలు తాకిన రూపె మార్చుకొనును,-దీనియర్థ...తి

'పాలు' స్వయంగా మూడు విధాలగు వరుసలకు గూడ, మూల కారణమౌతుంది. ఎట్లన—అ పాలు, 1వ తరంలో 'అమ్మ' కాగా, తోడు వేయుట వలన, 2వ తరంలో 'పెరుగు'గా మారి, 'కూతు'రౌతుంది. మరల, ఈ పెరుగు 'మజ్జిగ' (చల్ల)గా మారుట, మూడవ తరమగును.

కనుక, 'పాలు' పై మూడుతరాలకు ఆధారమౌతుంది. అది చాటుగావచ్చిన, అతిథి 'పిల్లి' (ఇంటి పులి)కి, ఆహారమౌతుంది. మనుమరాలగు 'మజ్జిగ' తనలో కలిసినంతనే, పాలు తన రూపాన్ని మార్చుకొని, 'పెరుగు'గా తయారౌతుంది.

పొడుపుకథ : తండ్రిని చంపింది, తాతను గూడింది, తండ్రిని గన్నది,-
ఉ. 'మజ్జిగ'

67. 'పొదలు విలోమానులోమముగ, చిత్రముగన్'

క. ముదితకు రెండు పదంబులు
పదమున మూడక్షరములు పరికింపంగా,
పదములలో దేనికదే-
పొదలు విలోమానులోమముగ, చిత్రముగన్॥

ఒక ముద్దరాలికి తగిన రెండు పదాలు వెదకి చెప్పాలి. ప్రతిపదంలో మూడేసి అక్షరాలుండాలి. అంతేకాక, ఆ ప్రత్యుత్తర పదాలు, దేనికదే విడిగా, అనులోమ-విలోమంగాకూడ, ఒప్పుచూ ఉండాలి. అవి ఏవి?

ఉ ఆ రెండు పదాలు-'నళిన-నయన' అనునవి. ప్రతిపదం మూడక్షరాలతో ఎటువైపు నుండి చదివినా, ఒకే విధంగా ఉండటం విచిత్రం కాదా! మరియు ఈ 'నళిన-నయన' రెండు పదాలను కల్పిన, ఒక 'తామరసనేత్రి' (స్త్రీ, ముదిత)ని కూడ తెల్పుతాయి.

68. "ఆదులుడుపంగ తుద రెల్ల నామలగును"

N.B. 1. రెండక్షరాల ప్రత్యుత్తరములోని, ఆద్యక్షరాలను తీసివేయగా, మిగిలిన రెండవ అక్షరం, తర్వాతి ప్రత్యుత్తరానికి మొదటి అక్షరం కావాలి.

2. విస్తరభీతిచే, పద్యాలలోని చమత్కృతిమత్ పాదాలను కొన్నింటిని మాత్రమే ఉదాహరించుచున్నామని మనవి.

సీ. భోజమహారాజు పురము పేరెయ్యది?
వల్లవాయుధునకన్న తల్లి యేది?
కవిరాజమణులకు గల నిధానం బేది?
త్వరగహానకు కాయుధాన్యమేది?...

ఉ. భోజుని పురము 'ధార' 2. చిగురుటాకు ఆయుధంగా గల

మన్మథుని తల్లి రమ(లక్ష్మి). మొదటి జవాబు 'ధార'లోని చివరి అక్షరం 'ర' రెండవ జవాబు 'రమ'కు ఆద్యాక్షరమైనది.

3. కవిరాజశేఖరులకు గల ఆవి కారణమేమి? ఉ॥మతి 4. నీళ్ళలో త్వరగా నాను ధాన్యమేది. తిల(నువ్వు-ధాన్యము). రెండవ జవాబగు 'రమ' లోని అంత్యాక్షరమగు 'మ' మూడవజవాబు 'మతి'కి ఆద్యక్షరమైనది అట్లే 3వ జవాబు అంత్యాక్షరమగు 'తి' 4వ జవాబగు 'తిల'కు ఆద్యక్షరమైనది....

**68. "ఐదు వక్త్రము లొప్పిన యనఘు డెవడు?"**

తే. రెండు ముఖములు గలుగు ఘనుం డెవండు?
మూడు మోములుగల జగత్పూజ్యు డెవడు?
నాల్గు మోములుగల లోకనాథుడెవడు?
ఐదు వక్త్రము లొప్పిన యనఘుడెవడు?
ఆరు నిటలంబు లలరు సుధీరు డెవడు?
పది లలాటంబుల చెలగు ప్రభుడెవండు?
నూరు ఫాలంబులను గ్రాలు వీరుడెవడు?
వేయి వదనంబుల వెలుగు విబుధుడెవడు? ॥

వి. పద్యంలో 8 ప్రశ్నలున్నవి. వానికి ప్రత్యుత్తరాలు....

ప్ర. 1. రెండు నోళ్ళుగల గొప్పవాడెవడు? ఉ. అగ్ని
2. మూడు ముఖాలు గల లోకైకవంద్యుడు? దత్తాత్రేయుడు
3. నాల్గు నోళ్ళుగల జగన్నాథుడు? బ్రహ్మ (చతుర్ముఖుడు)
4. అయిదు మోములుగల పుణ్యమూర్తి? శివుడు (పంచముఖుడు)
5. ఆరు నోరులుగల ధీరుడు? కుమారస్వామి (షణ్ముఖుడు)
6. పది ఫాలములు గల ప్రభువు? రావణుడు (దశముఖుడు)
7. నూరు నుదురులు గల వీరుడు? శతముఖ రావణుడు

8. వేయి నోళ్ళతో వెలుగొందువాడు? ఆదిశేషుడు

వి. వీని సమాధానాలకై "పూర్వగాథాలహరి"ని దర్శింపవలెను.

## 70. ప్రమథ నాయకు దరయ శిరస్తదారు

తే. కమల గర్భు దరయంగా ముఖస్థదారు,
రమకు నాయకుందరయ ఉరస్థదారు,
ప్రమథ నాయకు దరయ శిరస్థదారు,
— దీని భావమేమి?

వి. మహమ్మదీయ, ఆంగ్లేయుల పాలనలో శిరస్తదారు, తాసీల్దారు .... మొదలగు ఉద్యోగులుండెడివారు. పారసీ భాషలో 'దార్' శబ్దానికి 'కలవాడు, ఉంచుకొనువాడు' అని అర్థం. సంస్కృతంలో 'దార' శబ్దానికి 'భార్య' అని అర్థం. కాగా, ఈ ద్విభాషా శబ్దాంతో కవి, త్రిమూర్తులను అన్యాపదేశంగా, చమత్కారంగా, అపహాస్యం చేస్తున్నాడు 1. బ్రహ్మను చూతమా? ఆతడు 'ముఖస్థదారు' (భార్యయగు సరస్వతిని నోటిలోనే దాచుకున్నాడు) 2. ఇక లక్ష్మి (రమా) పతిని చూతమా 'ఉరస్థదారు' (వక్షఃస్థలమున భార్య యగు లక్ష్మి నుంచుకున్నాడు). ఇక ప్రమథ గణాధిపతి యగు శివుని సంగతికి వస్తే, ఆతడు 'శిరస్థదారు' (తలపై భార్య యగు గంగను ధరించెను).

## 71. "అన్నింటికి నుత్తరం బొక్క అక్షరంబు"

సీ. సుదతిరో! ఘనమైన సురభికి పేరేది?
శివభూషణములందు శ్రేష్ఠమేది?
చెరువు లోపల నీరు చేల కిచ్చుట కేది?
పైరు కోసిన వెనక పంట నేది?
బలు ఫిరంగుల ధ్వనుల్ బలుకుట నది యేది?
చెలగి బ్రహ్మతో తులు సేయు టేది?

ఎనిమిది గడియల నేర్పడు నది యేది?
ప్రభువులు కోపంబు నేయునేది?
అన్నిటికి జూడ నొక్కొక్క యక్షరంబు
సున్న దీర్ఘంబు తేర్పడ జెప్పవలయు
చిత్త భవభంగ! శివలింగ! చిన్మయాంగ!
వృషతురంగ! శుభాంగ! గౌరీశలింగ॥

ప్ర. 1. ఓ సుదతీ! గొప్ప కామధేనువు పేరేమి? ఉ. గాం (గోవు)

2. శివుని అలంకారములలో శ్రేష్ఠమైనదేది? ఉ. పాం (పాము)

3. చెరువు నీటిని చేలకు ఇచ్చునదేది? ఉ. తూం (తూము)

4. జొన్న మొ. పైరుకోసిన తర్వాత పండునదేది? ఉ. నాం (జొన్న మొ. వాని పిలక)

5. అనేక ఫిరంగులు పేల్చిన శబ్ద మెట్లుండును? ఉ. 'ధాం' (ధామ్మని శబ్దం విన్పడును)

6. బంట్రోతులు ఏమి చేయుదురు? ఉ. సాం (మంచి-తనం, మాట లేక సలాం)

7. ఎనిమిది గడియల కేది ఏర్పతుసు? ఉ. యూం (జాము)

8. ప్రభువులు దేనిపై కోపగింతురు? ఉ.

8 ప్రత్యుత్తరములన్ని సున్న, దీర్ఘ స్వరములలో కూడి, ఒకే అక్షరంగా నున్నవి.

72. "రాముడు గాచిన రాక్షస పక్షేది?"

సీ. మనుజుని యాకార మహిమకు మొదలేది?
నగవైరి వైరికి నగర మేది?
రాముడు గాచిన రాక్షస పక్షేది?
శిబి, కర్ణు లార్జించు చెలువమేది?...

ప్ర. 1. మనుష్య స్వరూపమును చెప్పు ముఖ్యాంగమేది? ఉ. తల

2. నగ - వైరి - వైరికి=పర్వతముల రెక్కలు నరికి - విరోధి యైన ఇంద్రునికి - శత్రువైన రావణునియొక్క, పట్టణమేది? ఉ. లంకా (లంకా పట్టణము)

3. శ్రీరాముడు రక్షించిన క్రూరపక్షి యేది? ఉ. కాకాసురుడు

4. శిబి చక్రవర్తి, రాధేయుడు (కర్ణుడు) సంపాదించిన మంచిరీతి (చెలువము) ఏది? ఉ. కీర్తి

1వ జవాబు 'తల' చివరి 'ల', రెండవ జవాబు 'లంక'కు ఆద్యక్షరము, 2. 'లంకా' చివరి అక్షరము 'కా' 3వ కాకికి మొదటి అక్షరము, 3వ 'కాకి' చివరి అక్షరం 'కి' (కీ) నాల్గవ జవాబు 'కీర్తి'కి ఆద్యక్షరమైనదవి గమనింపవలెను.

ఈ పద్యంలోని ప్రశ్నోత్తరాలన్నీ రెండక్షరాలు కలిగియున్నవి. ఆద్యక్షరాలను తొలగింపగా, మిగిలిన తుది (చివరి) అక్షరం, తర్వాతి ప్రత్యుత్తరానికి మొదటి అక్షరమగుట విచిత్రము.

## 73. అన్నిటికి రెండక్షరాల ప్రత్యుత్తరాలు

సీ. మనుజుని సృష్టించు మహనీయు పేరేమి?
పడతి మానము మర్గు పరచు నేది?
చంద్రుండు పొడసూప సంతసించున దేది?
నాగుపాముకు మరో నామమేది?
వెన్నెలలో నుండు విఖ్యాత గుణమేది?
కరకులోభి యొనర్చు కార్యమేది?
పరగ రూపసి యింతి పర్యాయ పదమేది?
మనిషి కుండగరాని గొనమ దేది?

అన్నిటికి జూడ రెండేసి యక్షరములు
చివరి వర్ణంబునందున 'లవ'లు మిశ్ర
మము నొనర్ప గ ఉత్తర్యాలమరియుండు
ఎరుగజెప్పుడు విజ్ఞాన గరిమ మీర!

N.B పద్య-ప్రశ్నల యొక్క, ప్రత్యుత్తరాలన్నిటికి, రెండక్షరాలే ఉండవలెను. అయితే, ఆ జవాబులు, వస్తుతః, మూడక్షరాలు గలవిఅయినా, చివరనున్న 'ల-వ' అను రెండక్షరాలు కలియుటచే, ఏకాక్షరమగునట్లు చేసి, మీ విజ్ఞాన విశాలతను వింగడించుకొని, ప్రత్యుత్తరాలను ప్రదర్శింపవలెను సుమా!

ప్ర. 1. మానవులందరిని సృష్టించు మహానుభావుడెవరు? ఉ.నల్వ (నలువ=బ్రహ్మ)

2. మహిళ-మర్మావయవాన్ని కప్పరకీయవి దేది? ఉ.వల్వ (వలువ =వస్త్రము)

3. చంద్రోదయంతో నంతసించునదేది? ఉ. కల్వ (కలువ=పూవు)

4 త్రాచుపాముకు మరొక పేరేమి? ఉ. చిల్వ (చిలువ=నాగుపాము)

5. వెన్నెలలో వెలుగు ప్రసిద్ధగుణమేది? ఉ. చల్వ (చలువ=చల్లదనము)

7. క్రూరబుద్ధి గల పిసినిగొట్టు ఏమి చేస్తాడు? ఉ. విల్వ (విలువ =దాచుట)

7. చక్కని రమణికి మరొక పదమేది? ఉ. చెల్వ (చెలువ=అందం గల ఆడుది)

8. మనుష్యునకు పనికిరాని గుణమ దేది? ఉ. పల్వ (పలువ= దుష్టత్వం)

వి. ప్రతి పత్యుత్తరం చివరనున్న 'ల—వ' అను అరాక్షలు రెండూ కలిసి 'ల్వ' అను ఒకే అక్షరమగుట గమనార్హము కనుక, రెండక్షరాలతో సమాధానములైనవి.

74. "అక్షరద్వయమున నొక్కయుత్తరంబె యొసగవలయు"

N.B పద్యంలోగల పది ప్రశ్నలకు, రెండక్షరాలు గల, ఒకే ఒక పదాన్ని ప్రత్యుత్తరంగా చెప్పవలెనని నియమము.

సీ. 1 ఏక చక్రము బండి నెక్కు రేడెవ్వఁడు?
2 ఒడలెల్ల గనులైన యొడయ డెవఁడు?
3 మఱ్ఱియాకున బండు కుఱ్ఱవా డెవ్వఁడు?
4 శివుని యౌదల జేర్చి చెలగు నెవఁడు?
5 సమతమై సర్వభూతముల నేలు నెవఁడు?
6 వాయుభక్షణచేసి బ్రతుకు నేది?
7 అఖిల జీవంబుల కాధారమగు నేది?
8 కోమరారు మారుని గుఱ్ఱ మేది?
9 కంధి దాటి లంకగాల్చిన మృగ మేది?
10 క్షితిని జల్లబడఁగ జేయు నేది?
అరయ నన్నిటికిని నక్షర ద్వయమున
నొక్కయుత్తరంబె నొసగ వలయు॥

ఈ ప్రశ్నలకు 'హరి' అను రెండక్షరాల పదం నానార్థాలతో ప్రత్యుత్తరం.

1. ఒకే చక్రంగల రథంపై నెక్కి తిరుగువాడు-'హరి'=సూర్యుడు
2. దేహంనిండా కన్నులు కల 'హరి'=దేవేంద్రుడు
3. మఱ్ఱియాకుపై పరుండు బాలుడు 'హరి'=కృష్ణుడు
4. శివుని శిరస్సుపై (ఔదల) చెన్నొందు 'హరి'=చంద్రుడు
5. సర్వప్రాణులను సమానంగా పాలించు 'హరి'=యముడు
6. గాలిని మేసి బ్రతుకు 'హరి'=పాము
7. సర్వభూతములకు ముఖ్యాధారమైన 'హరి'=వాయువు

8. మన్మథుని సుందరవాహనమైన 'హరి'=చిలుక

9. సముద్రం (కంఫి) దాటి లంకాదహనం చేసిన 'హరి'=కోతి, హనుమంతుడు.

10. భామిని చల్లబడునట్లు చేయు 'హరి'=వాన.

వి.శ్లో. యమానిలేంద్రచంద్రార్క- విష్ణుసింహాంశు వాజిషు।
పికాహికపి భేకేషు 'హరి' ర్నా, కపిలే త్రిషు॥ అ.కో.

1. పుంలింగ 'హరి' శబ్దానికి, యముడు,7 వాయువు, 2 దేవేంద్రుడు 4 చంద్రుడు, 1 సూర్యుడు, 3 కృష్ణుడు, సింహము, కిరణము, గుఱ్ఱము, 8 చిలుక, 6 పాము, 9 కోతి, కప్ప....మొ. నానార్థములు 'అమరకోశ ము'న గలవు. 2 కపిలము (బంగారుఛాయ గలది) అను అర్థము చెప్పి నపుడు, ఈ 'హరి' శబ్దము, పుం-స్త్రీ-నపుంసకలింగము (త్రిషు)లందుం డును. ఈ హరి శబ్దమున కింకను అర్థములెన్నో కలవు.

## 75. అన్నిటి జవాబు మూడేసి అక్షరములు

సీ. కరణాల చేతిలో గలుగు నాయుధమేది?
కానకు గుణమిచ్చాయ గలుగునేది?
బాలుండు వ్రాతకై పట్టుకొనియెడిదేది?
వరగృహంబున కేది వరలు కప్పు?
ఇంటిలోపలికేగ నేమి దాటగవలె?
భర్తకై ఇల్లాలు పరచునేమి?
శార్కరి నేమని జనులు వాకొందురు?
చెలగి మూషక మేమి చేయుచుండు?
అన్నిటికి జూడ మూడేసి అక్షరములు
నీవలావల గన సరినెన్నవలయు, చిత్రభవభంగ...

ప్ర. 1. గ్రామకరణీకం చేయువాడి చేతిలో ఏ ఆయుధముండును?
ఉ. కలము

2. అడవికి అందాన్నిచ్చునదేది? ఉ. ములక (ఒకచెట్టు)

3. వ్రాయుటకై పిల్లవాడు దేనిని పట్టుకొనును? ఉ. పలక

4. గృహరాజమున కేది పైకప్పుగా పనికివచ్చును? ఉ. కలప (కొయ్య)

5. ఇంటిలో ప్రవేశించుటకు దేనిని దాటవలెను ఉ. కడప

6. భర్తకోసం భార్య దేనిని పరచును? ఉ. పడక

7. జనులు చక్కెర నేమని పిల్తురు? ఉ. గులుక

8. ఎలుక విజృంభించి (చెలగి) ఏమి చేయును? ఉ. కలుగు(రంధ్రము)

వి. అన్ని ప్రత్యుత్తరాలు మూడేసి అక్షరాలతో నున్నవి. మరొక విశేషమేమనగా మొదటి ప్రశ్నోత్తరం చివరనున్న అక్షరాలు వరుసగా, తర్వాతి జవాబులకు మొదటి అక్షరాలుగా మారి ఉన్నవి. ఉదా. మొదటి ప్రత్యుత్తరమగు 'కలము'లోని చివరి అక్షరము, తర్వాత ప్రత్యుత్తరమగు 'ములక'కు ఆద్యక్షరమైనది. ఇట్లే మిగిలినవాని నెన్నవలెను.

## 76. ఆ రాము డేటికి అడవికెగె

సీ. శ్రీరామునకు సీత చెలగి ఎచ్చటనుండు?
ఆ రాము డేటికి అడవికెగె?
దాగిన మారీచు డేది దాల్చుచు వచ్చె?
ఎసగి దైత్యుని రాము డెచట చంపె?

విస్తర భీతిచే, పద్యపాదములు తగ్గింపబడినవని మనవి.

ప్ర. 1. శ్రీరామునకు సీత ఏ వైపున నుండును? ఉ. డాకడా (ఎడమవైపున)

2. రాముడడవికి ఏల వెళ్ళెను? ఉ. కైకకై (పినతల్లి కైకేయి యొక్క కోర్కెను తీర్చుటకై)

(9)

3. మారీచుడు ఏ ఆకారముతో వచ్చెను? ఉ. మెకమె (మారీచుడు కనక మృగరూపమును ధరించి వచ్చెను)

4. రాముడా రాక్షసుని ఎచ్చట చంపెను? ఉ. నేలనే (నేలమీదనే చంపెను)

మూడు అక్షరాలతోనున్న ఈ జవాబులు నాలుగు, ఇటునుండి అటు అటునుండి ఇటు (అనులోమ విలోమంగా = ఈవలావలకు)చదివినా ఒకే విధంగా నుండుట విచిత్రము.

## 77 నడిమి అక్షరాల్ ప్రత్యుత్తరాలు

సీ. పార్వతీ రమణుని పట్టణం బెక్కడ?
పరమేష్ఠి సతిపేరు బలుకులేమి?
ఖడ్గంబునకు వాడిగలిగి యేమిట నిలుచు?
కాంతల ముఖమందు గలుగునేది?
వక్ష మందున నేమి వైకుంఠు డునిచెను?
వసుమతీశులవద్ద వ్రాతకెవరు?
కాంతలలో మేలు గణుతింప నెవ్వతె?
పరమాత్ముడేమిట పడతి జేసె?
అన్నిటికిజూడ మూడేసి యక్షరములు
నడిమి మాత్రలజూచిన నయముగాను
'శారద'యు 'లక్ష్మి' 'పార్వతి' శాశ్వతముగ
మనల కరుణావిధేయులై మనుచుచుంద్రు ॥

ప్ర. 1. పార్వతీప్రియుడగు శివుని నగరమెక్కడ? ఉ. ఈ'శా'న్యం

2. బ్రహ్మభార్యను చెప్పు పదమేది? ఉ. శా'ర'ద

3. కత్తిని రుద్దితే ఏమి వస్తుంది? ఉ. వ'ద'(దు)ను
4. అతివల ముఖానికందాన్నిచ్చేది ఏది? ఉ. తి'ల'కం
5. విష్ణువు తనరొమ్మునం దెవరి నుంచెను? ఉ. ల'క్ష్మి'ని
6 రాజులవద్ద లెక్కలు వ్రాసేవారెవరు? ఉ. వ్యా'పా'ర్లు
7. స్త్రీలలో మిక్కిలి అందగత్తె ఎవరు? ఉ. ఊ'ర్వ'శి
8. శ్రీరాముడు దేనిని 'నాతి'గ జేసెను ఉ. రా'తి'ని

ఈ మూడక్షరాలలోని ప్రత్యుత్తరాలలోని మధ్యాక్షరాలను,వరుసగా కలిపిన 1. శారద (సరస్వతి), 2. లక్ష్మి, 3. పార్వతి వస్తారు. వారు మనలనందరిని కరుణింతురుగాక !

## 78. "ఈవ లావల జూచిన ఏక విధము"

పార్థ శంకరులేల పైకొని పెనగిరి ?
పతి బాసి, చాయ ఏపగిది నుండె?
చింతచిగురునందు చెలగెడు రుచి ఏది?
స్త్రీ ప్రౌఢతను చాటి చెప్పునద్ది?
తపసుచే నేమిట దసరు సాధింపంగ?
ధర్మవ్యాధు డెవరు ధరణిలోన ?
అతివ కంఠము నిచ్చునది యేది ధరలోన?
'జీవంతి'యని దేని చెప్పుచుంద్రు?
అన్నిటికి జూడ మూడేసి అక్షరములు
ఈవ లావల జూచిన ఏకవిధము,-చిత్రభవభంగ!...

ప్ర 1. అర్జునుడు, శివుడు, ఒకరిపై నొకరుపడి ఏల పోరాడిరి? ఉ. కిటికి (పందికై)
2. భర్తకు దూరమైన 'చాయ' ఏవిధంగా ఉండెను? ఉ. బడబ (ఆడు గుర్రము-ఆకారములో)

3. చింత చిగురులో నేమిరుచియున్నది? ఉ. పులుపు
4. స్త్రీ యొక్క జాణతనాన్ని చాటునది ఏది? ఉ. కులుకు (విలాసము)
5. తపస్సుచేసి సాధింపవీలైనదేమి? ఉ. మహిమ (గొప్పదనం)
6. ధరలోనున్న ధర్మవ్యాధుడెవడు? ఉ. కటిక (వాడు)
7. ధరణిలో ఆడువాని కంచాన్నిచ్చునది ఏది? ఉ. వలువ(వస్త్రం)
8. వేనిని 'జీవ స్తి' అని పిలుస్తారు? ఉ. కరక (కరకాయ, పాల కూర, తిప్పతీగ అను)

జవాబులన్నీ మూడక్షరాలతోనే ఉన్నవి. ఈ జవాబులు, ఎటుత్రిప్పి చదివినా ఒకేవిధంగా ఉండటం విశేషాంతరం.

### 79. "అన్నిటి జవాబు నాల్గేసి అక్షరములు"

సీ. శ్రీమంతుడును భార్య చెలగుచు నొక్కటి
కీలంబు శాఖయు గ్రాలు నొకటి
రదనంబు కాకంబు రహిమీఁద నొక్కటి
యవనిక యును చాప నెనయు నొకటి
పత్రంబు గ్రావంబు పరగంగ నొక్కటి
నేత్రంబు శిశువును నెనయు నొకటి
వెన్నుండు మరికొంత వివరింప నొక్కటి
వస్త్రంబు మగజాతి వరుస నొకటి
అన్నిటికి జూడ నాల్గేసి అక్షరములు
ఏకపదముగ జెప్పుడీ యిలను బుధులు
చెప్పగలిగిన నేనిత్తు చిన్న మాడ
చెప్పలేకున్న నగుదు నే చిన్నగవు.

ప్ర 1. ధనవంతుడు, భార్య-ఒకేచోటిలో నిమిడియుండు పదమేది? ఉ. ధని యాలు 1. ధని=ధనము గలవాడు, ఆలు=భార్య (ధని+ఆలు)

2. మేక, శాఖ(కొమ్మ)రెండు కలిసియుండు పదమేది? ఉ. చీలమండ 1. చీల=మేక, మండ=కొమ్మ (శాఖ)

3. పన్ను, కాకి రెండూ ఉన్న పదమేది? ఉ పలుగాకి (పలు+కాకి) 1. పలు=పన్ను(దంతము) 2. కాకి=ఒక పక్షి

4. 'తెర—చాప' రెండూ కలిసియున్న పదమేది? ఉ. తెరచాప 1. తెర=యవనిక (అడ్డుపల) 2. చాప=తుంగ, తాటాకుతో నేసిన చాప

5. పత్రము, పాషాణము రెండు పదాలు కలిసిన పదం ఏది? ఉ. 'ఆకు రాయి'

6. కన్ను, చిన్నబిడ్డ కలిసిన ఒకే పదమేది? ఉ. కను—పాప, కను=నేత్రం, పాప=బిడ్డ

7. విష్ణువు, కాంత కలిసిన ఒకే పదమేది? ఉ. విష్ణు-కాంత(ఒకపువ్వు)

8. బట్టను, మగవానిని చెప్పు ఏకపదమేది? ఉ చీరపోతు (తెల్లపేను) 1. చీర=వస్త్రము, పోతు=మగవాడు, మగది (పెంటి=ఆడుది)

వి. వేర్వేరు అర్థాలుగల రెండు పదాలుచేరి, ఒకేపదంగా ప్రత్యక్షమైన, ఈ ప్రత్యుత్తరాలన్నీ ప్రత్యేకార్థాలనిచ్చి, చమత్కారమును సృష్టించుట విచిత్రముగ లేదా ?

ఇట్టి, క్లిష్ట ప్రత్యుత్తరాలు చెప్పిన వారి కొక 'అరవరా' లేక పదిరూకలిచ్చెదను. చెప్పలేనివారిపై దయదలచి, చిరునవ్వుతో విడిచి పుత్తును.

## 80. 'అన్నిటికి నొక్కయు త్తరం బమరవలయు'

తే. వాయుదేవుని వహియించు వాహమేది ?
వానచినుకుల గ్రోలెడి పక్షి యేది?

చంపక పరిమళంబు సహింపదేది?
తలను ముత్యాలుఁగల మృగతిలకమేది?
అన్నిటికి నొక యుత్తరం బమరవలయు?

ప్ర.1. వాయుదేవు (గాలి)ని మోసెడి వాహనమేది? ఉ. 'సారంగము' (=లేడి)

2. వానచినుకులతో బ్రతుకు పక్షి-'సారంగము' (చాతకము)

3. సంపెంగ వాసన సరిపడనిది-'సారంగము' (తుమ్మెద)

4. తలలో ముత్యాలుగల శ్రేష్ఠమృగము-'సారంగము' (ఏనుగు)

పై నాలుగు ప్రశ్నలకు "సారంగము" అను ప్రత్యుత్తరమొక్కటే అమరినది. సారంగము: (నానార్థములు) 'తుమ్మెద, లేడి, ఏనుగు, వానకోయిల (చాతకము), నెమిలి, విల్లు, చందనము, గొడుగు.... మొ.నవి.

## 81. వాని తలదీయ క్షుద్రదేవత జనించు

పక్షివర్యుఁడు వరగు పంచాక్షరముల
వాని తలదీయ క్షుద్రదేవత జనించు,
వాని తలదీయ తక్కెడ వరలుచుండు
దాన ప్రథమాక్షరము తీయ దనరు నృపతి॥

ఉ. అయిదక్షరాల శ్రేష్ఠ పక్షి 'కపోతరాజు'

1. ఆ పదంలోని మొదటి అక్షరం (తల)తీసివేసిన, 'పోతరాజు' మిగిలి, ఒక క్షుద్రగ్రామ దేవతను తెల్పుతుంది. 2. ఆ 'పోతరాజు' పదం నుండి, మొదటి 'పో' తీసివేసిన 'తరాజు' మిగిలి, 'తక్కెడ'ను తెల్పును. 3. మరల ఆ 'తరాజు' నుండి మొదటి 'త'ను తీసివేసిన 'రాజు' మిగిలి, ప్రభువు (నృపతి) అనే అర్థాన్ని తెల్పుతుంది.

## 82. "అన్నింటికి జూడ నైదేసి యక్షరాలు"

1. సీ. రాముడెవ్వారితో రావణుమర్దించె ?
పరవాసుదేవుని పురమదేది ?
అల రంభ కొప్పులో నలరు మాలిక ఏది?
సభవారి నవ్వించు జాణ ఎవడు?...

## 83. "రామలింగ కవీంద్రు నామమేది?"

2. సీ, లజ్జ యెవరి కమూల్యపు నలంకారంబు?
నెలతోడి చెలిమి దేనికి జెలంగు?
కలహంస విహరించు కాసార మెయ్యేది ?
రామలింగ కవీంద్రు నామమేది? ...

## 84. ఈశ్వరుండెవ్వాని నెచ్చోట ధరియించు....

3. సీ. రాజుల కెటువంటి రత్నముల్ ప్రియమయ్యె?
కాయలే చెట్లవి కరులు ద్రింగు?
ఈశ్వరుండెవ్వాని నెచ్చోట ధరియించె(చు)?
జారుడెవ్వారి నెసంగగోరు ? ...

విస్తర భీతిచే పద్యములను పూర్తిగా వ్రాయలేదని మనవి.

1 సీ. అన్నిటికి, వరుసగా ప్రత్యుత్తరాలు :

1. శ్రీరాముడెవరి సహాయముతో రావణాసురుని జంపెను?
ఉ. లోకమూకతో ( = లోకలుగల కోతుల గుంపుతో)
2. వసుదేవుని పుత్రుడగు (కృష్ణుని) విష్ణువు, (రంగనాథుని) యొక్క పట్టణమేది?
ఉ. రంగనగరం ( = శ్రీరంగపట్టణము)
3. 'రంభ' యను అప్సరస జుట్టుముడిలో శోభిల్లు పూలమాల ఏది?
ఉ. మందార దామం ( = మందార పుష్పముల గుత్తి)

4. తన వికట చేష్టలచాతుర్యంతో సభాసదులకు హాస్యమునందించు నేర్పరి ఎవరు?

ఉ. వికట కవి (=హాస్య పూర్ణ కవిత్వము చెప్పువాడు)

N.B పై ప్రత్యుత్తరములన్నియు, అయిదక్షరాలతో ఇటు వటు ఒకటిగా నున్నవి.

2 సీ. ప్రత్యుత్తరాలు :

1. సిగ్గెవరికి అమూల్యాభరణము? ఉ. కుల స్త్రీలకు

2. చంద్రుని (నెల)తో స్నేహము దేనికి ఉండును?

ఉ. కుముదముకు (కలువకు)

3. 'హంస'అను పక్షి విహరించు సరస్సు ఏది?

ఉ. సుర సరసు ( = దేవతల సరస్సు)

4. రామకృష్ణునికి పెట్టినపేరేది? ఉ. వికటకవి

పై నాలుగు జవాబులు అయిదక్షరాలతో, అనులోమంగాను, ప్రతిలోమంగా కూడ సమానముగనున్నవి.

3 సీ. ప్రత్యుత్తరములు :

1. రాజుల కిష్టమైన రత్నములేవి? 2 ఏ చెట్లకాయలను ఏనుగులు తినును? పైరెండు ప్రశ్నలకు "వెలగలవె"అనునది ఒక్కటే సమాధానము

1. రాజులకు, వెలగలవి+ఎ = మిక్కిలి విలువ గలిగిన రత్నాలే ప్రియమైనవి.

2. ఏనుగులు 'వెలగ-లవి+ఎ' = వెలగచెట్ల కాయలనే,భక్షించును

3 శివుడెవ్వని, నెక్కడ, ధరించును? 4. వ్యభిచారి ఎవరిపై అతిశయించును? ఈ రెండు ప్రశ్నలకు 'నెలతలనె' అనునది ఒక్కటే సమాధానము.

1 శివుడు నెల-ను (చంద్రుని) తలను+ఎ = తలమీదనే ధరించును. 2. జారుడు నెలత-లను+ ఎ = స్త్రీలమీదనే, అతిశయించి ప్రవర్తించును.

N B–పై 1, 2 పద్యాల ప్రతిపాదంలోని రెండు ప్రశ్నలకు, రెండు ప్రత్యుత్తరాలుగాక, ఒకే సమాధానముతో సరిపెట్టుట దీనిలోని విశేషాంతరము.

పై మూడు పద్యాలలోని ప్రత్యుత్తరములు, అనులోమంగా, విలోమంగానుకూడ ఒకే సమాధానములుగా నుండుటనుముందే గమనించినాము గదా !

## 85. "అంతలోననే అగును గజాననుండు"

చ. నగతనయన్-ధరన్-సిరిని, నాలుగు వర్ణములన్
లిఖించి, పొం
దుగ నొక యక్షరంబు తుద దూకొని నిల్పిన
యంతలోననే
యగును, గజాననుండు, మరియందొక
యొక్కొక యక్షరంబు, డిం
చగను, చతుర్ముఖుండు, శరజన్ముడు, పంచ
శరుండు వహ్నియున్ ॥

పాత 'గృహలక్ష్మి'లోని ఈ పద్యానికి ప్రత్యుత్తరం "ఉమాకుమార".

అర్థం : నగతనయన్ = పర్వతరాజ పుత్రికయగు 'ఉమా' (పార్వతి)ను,ధరన్=భూమి అర్థాన్ని తెల్పు 'కు' ను, సిరిని=లక్ష్మిని తెల్పు 'మా' ను, ఈ నాలుగు వర్ణాలను వరుసగా వ్రాసి, చివర మరొక (ర) అక్షరాన్ని దూకొని=అంగీకరించి, చేర్చినంతలో, 'ఉమాకుమార' కాగా, దీనినుండి గజాననుండు=వినాయకుడు వస్తాడు. మరల క్రమంగా ఒకొక్క అక్షరాన్ని చ్యుతంచేసిన (తగ్గించిన), మా-కుమార=లక్ష్మి

పుత్రుడగు చతుర్ముఖుడు (బ్రహ్మ), కుమార = కుమారస్వామి (శర జన్ముడు), మరల, మిగిలిన 'మార' =(నుండి) మన్మథుడు (పంచశరుడు) చివరికి మిగిలిన 'ర'=కు అర్థం అగ్ని (వహ్ని)యు రాగలవు.

వి. ఇట్లు, వరుసగా, ఒక్కొక్క అక్షరం తొలగించుకుపోగా, నానార్థములు బహిర్గతము లగుచున్నవి. కనుక - ఇదొక 'చ్యుత చిత్రము'.

## 86. ఒక్క పురము పేరొప్పనై దక్కరముల....

ఒక్క పురము పేరొప్పనై దక్కరముల
మొదటి మూడును వత్సరమునకు పేరు
చివరి రెండును వీథికి జెల్లు, వేణి
యగు ద్వితీయాంతముల, జెప్పుడా పురమ్ము!

ఉ. 'విజయవాడ'. దీనిలో అయిదక్షరాలున్నవి. మొదటి మూడక్ష రాలగు 'విజయ', ప్రభవ, విభవ, శుక్ల.... మొదలగు అరవై సంవత్స రాలలోని 'విజయ' నామ సంవత్సరాన్ని తెల్పుతుంది. ఇక, చివరి రెండక్ష రాలగు 'వాడ' వీథిని తెల్పును. మరల, ద్వితీయ+అంతములన్=రెండవ అక్షరమగు 'జ'ను, చివరనున్న 'డ'ను కలుపగా, 'జడ' (వేణి) కాగల దవి తెలియవలెను.

## 87. ఒక్కమాటలో లోపల నుండవలయు.

ఒకే సమాసపదంలో అనేక పదార్థాలు ఇమిడి యుండవలెను.

ఈ క్రింది "ఏనుగు సింగంబు నెలనాగయును గూడి...." పద్యం యొక్క పాదాలు పరిపరివిధాలుగా, ఒకటా? రెండు పద్యాలా?.... అను భ్రాంతిని కూడ కల్గిస్తూ, చమత్కార జనకాలుగా నుండుట వలన, విస్తర భీతి ఉన్నా, పాఠక ప్రభువుల ప్రమోదం కోసం, ఆయా పాదాలను కలిపినా, విడివిడిగా వివరిస్తున్నాము.

మరియు, తత్కర్త(లు) వాని అర్థాల ఆవిష్కరణకు, పదునైదు (15) లేక 12 నెలల గడువునిచ్చి, చెప్పినవారికి 'భావజ్ఞశేఖర-చక్రవర్తి' అను బిరుదు కూడ, ప్రశ్నించినవాడు ఇస్తాడట! చెప్పలేకపోతే, ఒక్క చిరునవ్వుతో సరిపెట్టుకొంటాడట! ఇక, అవేవో ఆలోచించి, ప్రత్యుత్తరించే భారం పాఠకులపై బడింది. పరిశీలించి చెప్పండి.

సీ. 1. ఏనుగు, సింగంబు, వెలనాగయును గూడి
యొకమాట లోపల నుండవలయు,
2. దశరథాగ్రసుతుండు, శశియును పట్టణం
బొకమాట లోపల నుండవలయు,
3. దర్పకాంతకుడు, నేత్రంబును, మాలయు
— నొకమాట...
4. వేల్పును, క్రోవయు, వెలయు ప్రసూనంబు
— నొకమాట...
5. కనకంబు, కార్పాన, మొనర మహీజంబు
— నొకమాట...
6. రారాజు, రతిరాజు, రాజరాజును గూడి
— నొకమాట....
7. పక్షియు, వృక్షంబు, పాషాణమును గూడి
— నొకమాట...
8. ఫణిరాజు, ఫణివైరి, ఫణిభూషణుడు గూడి
— నొకమాట....

తే. గీ. దీని యర్థంబు జెప్పగా ధీవిధులకు
నెలలు పన్నెండు గడువిత్తు నేర్పుగాను

(1. మది విచారించి పదునైదు మానములను....)
(2. నమ్మితిగ జెప్ప భావజ్ఞ చక్రవర్తి)
చెప్పనాతడు భావజ్ఞ శేఖరుండు
చెప్పలేకున్న నగుదు నే చిన్ననగవు
(లక్షణోపేత కృష్ణరాయ క్షితీంద్ర)

వీని కన్నిటికి, యథాక్రమంగా సమాధానాలు....

ఉ. 1. నాగకేసరాలు=ఇది ఒక చెట్టు, లేక ఒక వడ్లరకమునకు పేరు. 1 నాగ=ఏనుగు, 2 కేసరి=సింహము, 3 అలు = పడుచుది (ఎల నాగ) అను మూడు పదార్థాలు ఒక్క సమానపదం లోపల ఇమిడియున్నవి. ఇట్లే మిగిలిన అన్నిచోట్ల గమనించాలి.

ఉ. 2. రామచంద్రపురము = ఇదియొక నగరము పేరు 1. రామ = దశరథుని పెద్దకొడుకు, 2 చంద్ర = చందమామ, 3 పురము = పట్టణము.

3. రుద్రాక్షమాల = భక్తులు మెడలో ధరించు దండ. 1 రుద్ర= (దర్పక (మన్మథ) + అంతరుడు (నాశనం చేసినవాడు) = శివుడు, 2 అక్ష = కన్ను, 3 మాల = దండ.

4. దేవదారి పుష్పము = ఒక పువ్వు. 1 దేవ = దేవతమ, 2 దారి = త్రోవను, 3 పుష్పము = ప్రసూనము (పువ్వు)ను తెల్పును.

5. పైడిపత్తి చెట్టు = ఒక రకమైన చెట్టు. 1 పైడి = కనకము (బంగారము), 2 పత్తి = కార్పాసము (దూది), 3 చెట్టు = మహీజము (వృక్షము)

6. రాజమదన కుబేరము = ఒక ఔషధము. 1 రాజ = రారాజు = దుర్యోధనుడు, 2 రతిరాజు = మదనలేకమన్మథుడు,కుబేరము = కుబేరుడు (రాజరాజు).

7. పిట్టపేపరాయి. 1 పిట్ట = పక్షి, 2 పేప = పేము - చెట్టు (వృక్షంబు), 3 రాయి = పాషాణము (శిల).

8. అనంత పక్షీశుడు. 1 అనంత = అనంతుడను ఫణిరాజు (నాగ) 2(ఫణివైరి = (గరుత్మంతుడు), పక్షి = గరుత్మంతుడు, ఈశుడు = శివుడు(ఫణిభూషణుడు).

లేక 'నాగగరుడేశ్వరము' (ఒక పుణ్యక్షేత్రము) కూడ జవాబు కావచ్చును. అప్పుడు, 1 నాగ = పాము (ఫణిరాజు), 2 గరుడ = గరుడ పక్షి (ఫణివైరి), 3 ఈశ్వరము = శివుడు (ఫణిభూషణుడు) అని చెప్పుకొనవలెను.

వి. ఈ పద్యంలోని 5, 6, 7, 8 అక్షరాల సమాధానములు వైచిత్ర్యాధాయకములగుట గమనార్హము.

## 88. ఆరు,నొక్క (7) అక్షరాలతో ఆస్పర్ధ

1. పక్షియు ముఖమును బరగ బీజమ్మును
   నొక మాట లోపల నుండవలయు,
2 వస్త్రంబు ముంగిలి వరున వృక్షము గూడి
   ఒక మాట లోపల నుండవలయు...

1. చిలుకముక్కు గింజ 2. బట్ట గడప చెట్టు (మూడుఉన్నపదాలు)

1. చిలుక = పక్షి, ముక్కు = ముఖము, గింజ = బీజము.

2. బట్ట = వస్త్రము, 2. కడప = ముంగిలి, చెట్టు = వృక్షము.

## 89. "ఉన్నవాదులనె వీని కుత్తరములు"

పద్యాలలో గల ప్రశ్నలకు, ఆయాపాదాల మొదటనే చిత్రముగా నున్న, ఈ ప్రత్యుత్తరములను పాఠక ప్రభు మహాశయులు పరిశీలింతురు గాక?

సీ. 1 హాలికుల లోపల సగ్రగణ్యుడెవండు?
   2 హారిహాయు తమ్ముడైనలరె నెవడు?

3 అలఁతలే కుదఖిలో నల్లాడు నెయ్యది?
4 నీలవర్ణుని కూర్మి నెలత ఏది?
5 నంతసం బెడి వణే క్సంతతి కొదవించు?
6 రాకాసి గమి కేది రాపుచేయు?
7 అలికాక్షు రిపువింటి కల్లెత్రాడెయ్యది?
8 దొరలేని సుఖముల మురియునెవడు?
తే. 9 దోవకారుల కెయ్యది తోడుపడును?
10 కలిమి కెడజేసి నలుని డాగలచె నెవడు?
11 ఘనుడెవడు తాపమడచి లోకమును బ్రోచు?
"ఉన్నవాదులనె వీని కుత్తరములు"॥

ప్ర. 1. హలము (నాగలి) గలవారిలో శ్రేష్ఠుడెవడు? ఉ. పాదాది యందున్న 'హలికుడు' (బలరాముడు) ప్రత్యుత్తరము. వి. హలము (నాగలి) ఆయుధముగా గలవాడు 'హలి'. దీనికి స్వార్థమున 'క' ప్రత్యయము రాగా, 'హలికుడు' అయ్యెను.

2. ఇంద్రునికి (హరిహయునికి) తమ్ముడెవడు? ఉ. ప్రశ్నకు మొదట నున్న 'హరి' (విష్ణువు) వామనుడు. వి. ఇంద్రుని తల్లియగు 'అతిథి' గర్భమున 'వామనుడు' (ఉపేంద్రుడు)గా పుట్టి, బలి చక్రవర్తిని పాతాళమున కణగదొక్కెనని పురాణగాథ.

3. ఏ మాత్రం అలసట లేకుండ, సముద్రంలో సంచరించునదేది? ఉ. పాదాది నున్న 'అల' (తరంగము, WaVe) ప్రత్యుత్తరమగును.

4. నల్లనయ్య కృష్ణునికి ప్రియమైనదెవతె? ఉ. ప్రశ్నకు మొదట నున్న 'నీల' (నీలాదేవి), శ్రీ కృష్ణుని అష్ట (8) మహిషులలో నీమె యొకతె.

5. నొసట కన్నుగల (అలిక+అక్షుడు) శివునికి శత్రు (రిపు)వగు

మన్మథుని ధనుస్సుకు అల్లెత్రాడు (నారి) ఏది? ఉ. పాదాది యందున్న "అలి" (తుమ్మెద) జవాబు.

6. సాటిలేని మేటి (దొర) సుఖములతో సంతోషించువాడెవడు? ఉ. ప్రశ్నకాది యందున్న 'దొర' (అధికారి, ప్రభువు).

7. వ్యాపారులకు సంతోషాన్ని గల్గించునది ఏది? ఉ. 'సంత' (నిర్ణయించిన దినమునందుండు అంగళ్ళ వరుస) సంత నాడెన్నో సరకులను తెచ్చి, పోటీపడి, కొంచెం లాభానికి, ఎక్కువ సరుకుల నమ్ముకొని వర్తకులు సంతసింతురు.

8. రాక్షస సంఘమునకేది రాపిడి చేయును? ఉ. రాక (పూర్ణచంద్ర సంగమము) చీకటిలో తిరుగు రాకాసి మూకకు, దొంగలకు పూర్ణిమ ఇబ్బంది గల్గించును.

9. తప్పు చేయు దొంగల కేది సహాయం చేయును? ఉ. దోష (రాత్రి) దొంగతనము, చీకటి తప్పులు, చేయుటకు రాత్రి అనుకూలమైనది.

10. భార్యయగు 'దమయంతి' సమాగమ భాగ్యమును ('కలిమి'ని) దూరంచేసి, నలమహారాజును బాధపెట్టిన దెవరు? ఉ పాదాది యందున్న 'కలి' (కలిపురుషుడు,) ఇతడు 'నల-దమయంతు'లను విడదీసి, వారికి ఎన్నో బాధలు కల్గించెను.

11. సంతాపాన్ని, వేడిని పోగొట్టి, లోకాన్ని రక్షించువాడెవడు? ఉ. పాదాది యందున్న 'ఘనుడు' (మేఘుడు). మేఘము వర్షించి, లోకుల తాపాన్ని పోగొట్టును.

N.B. ఈ పదకొండు ప్రశ్నలకు, ప్రత్యుత్తరాలు, వెదకి, వేసారవలసిన అవసరం లేకుండ, ఆయాపాదాల యొక్క, ప్రశ్నల యొక్క, మొదటనే (ఆదిలోనే) ఇవ్వబడినవని, పాఠకులు పఠించి, సంతసింపగలరు.

## 90. 'నారీలలామ! నీ పేరేమి? చెపుమన్న?

సీ. 1 నారీలలామ! నీ పేరేమి? చెపుమన్న?
దమిమీర నెడమ నేత్రమును జూపె,
2 మత్తేభయాన! నీ మగని పేరేమన్న?
దన చేతి జీర్ణ వస్త్రమును జూపె,
4 కుటిల కుంతల! నీదు కులము నామం బన్న?
బంజరంబున నున్న పక్షి జూపె,
3 వెలది! నీకేమైన బిడ్డలా చెపుమన్న?
కర మొప్ప మింటి చుక్కలను జూపె,
తే. ప్రభువు మీకెవ్వరన్న? 'గోవకు'ని జూపె,
ధవుని వ్యాపారమేమన్న? 'దండ'మిడియె,
చతురమతులార! ఈ ప్రౌఢజాణతనము
దెలిసికొనరయ్య! బుద్ధి కౌశలము మెరయ!

ఓ నిపుణమతులార! ఒక ప్రౌఢయగు నాయిక యొక్క, ఈ జాణ (నేర్పరి)తనమును, మీబుద్ధి సూక్ష్మత నుపయోగించి, తెలిసికొని,ప్రత్యుత్తరించండి.

(పద్యంలోని 'నారీలలామ!, మత్తేభయాన!, వెలది!, కుటిల కుంతల'—ఇవన్నియు స్త్రీ సంబోధనములని గమనింపవలెను.)

ప్ర. 1. స్త్రీరత్నమా! 'నీపేరేదో చెప్పు'మని ప్రశ్నింపగా, ఆమె నోటితో ప్రత్యుత్తరింపక, ఉత్సాహాతిశయం చూపుచు, చేష్టల చమత్కారంతో "తన ఎడమకంటిని' చూపి, అలవోకగా ప్రత్యుత్తరించినదట! దాని అంతరార్థమేమిటి?

ఎడమ కన్నును, సంస్కృతంలో 'వామాక్షి' (వామ+అక్షి) అంటారు. తెలుగులో అడిగిన అతని ప్రశ్నకు, ఆమె, తన నెరజాణతనం

నేర్పుగా ప్రస్ఫుటింపజేస్తూ, నా పేరు 'సంస్కృతం'లో 'వామాక్షి' అని సూచించెనని భావము.

2. ఓ మదగజగమనా! నీ భర్తపేరేమి? ఉ. ఆమె తన చేతిలోనున్న చిరిగిన వస్త్రమును (కు-చేలమును) చూపెను. చిరిగిన బట్టను సంస్కృతంలో 'కుచేల' మంటారు. కనుక, నా భర్తపేరు 'కుచేలుడు' అని ఆమె సంస్కృతంలో తెల్పెనని తెలియవలెను.

3. ఓ వనితా! నీకు పిల్లలెందరు? ఉ. ఆమె, చేయెత్తి, ఆకాశమున నున్న 'అశ్విని, భరణి....మొదలగు నక్షత్రములను చూపెను. అనగా, ఆమె 'అశ్విని, భరణి, కృత్తిక....మొదలగు చుక్కలు 27 గనుక, నాకును పిల్లలు ఇరువదియేడుగురని జవాబు చెప్పినట్లగును.

4. ఉంగరాల జుత్తుగలదానా! 'నీ కులమేది' అని ప్రశ్నింప, ఆమె పంజరములోనున్న పక్షిని చూపెను. వి. పక్షి=ద్విజము. అనగా, పక్షి మొదట గ్రుడ్డుగా పుట్టి, పిమ్మట పిల్లగా తయారగుటచే, అనగా రెండు సార్లు పుట్టుటచే, 'పక్షి=ద్విజము' అగుచున్నది. అనగా, నాది 'ద్విజ' (బ్రాహ్మణ) కులమని జవాబు. వి. మొదట అందరివలె తల్లి గర్భము నుండి పుట్టినవారైనను, పిమ్మట, ఉపనయనాది సంస్కారములచే, రెండవ సారి పుట్టుకవలన, బ్రాహ్మణుని 'ద్విజ, లేక ద్విజన్మ' అంటారు.

5. మీకు ప్రభువెవరనగా, కృష్ణుని (గోపకుని) చూపెను. అతడే ప్రభువన్నమాట.

6. నీ భర్త ఉద్యోగమేమనగా-'దండము' పెట్టెను. అనగా, నమస్కారం చేస్తూ, 'సీతారామాభ్యాం నమః' (భిక్షను గ్రహించినపుడు) అనుటయో, లేక, తపస్సు, పూజ చేసుకొని, దండం పెట్టడం, ధవుని వ్యాపారమని తెల్పెను.

N.B పై తెలుగు ప్రశ్నలన్నిటికి, ఆమె 'వాచా' సమాధానం

చెప్పక, జాణతనంతో ప్రశ్నించిన వానిని జాగరితం చేస్తూ, సంస్కారవతి గనుక, 'సంస్కృతం'లో, తత్రాపి, చేష్టల చమత్కారంతో, తన ప్రౌఢత్వాన్ని ప్రస్ఫుటంగా ప్రకటించుకొన్నది.

ఆ సమాధానాలనన్నిటిని, చక్కగా, సమీచీనంగా, సార్థకంగా, సంస్కరించి, వంట పట్టించుకొని తెలుసుకొంటే, మనం మాత్రం చతుర మతులం, చమత్కారజ్ఞులం, సాంస్కృతికులం, సంస్కారవంతులం కాలేకపోతామా? తప్పక, కాగలమని, కావలెననియే మా భావన.

## 91. డొంక తిరుగుడు ఆశీర్వచన పద్యాలు

మనసిజుమామ-మామ, యభిమానమడంచినవానిమామ,నం
దను విరోధి నందనుని నందను సుందరి, మేనమామ, జం
పినజెగజెట్టి పట్టి బొడి చేసిన శూరుని తండ్రి గన్నగన్
గొనిన సురాధినాథుని తనూభవునాయువు మీకునయ్యెడున్॥

ఇదొక డొంక తిరుగుడు ఆశీర్వచన పద్యము. దీనిలో నల్గురు మామలు, నందను లారుగురున్నారు, గమనించండి.

మనసిజు - మామ=మనస్సున బుట్టిన మన్మథునికి-మామ (1) (=చంద్రుడు), అతనికి తన కుమార్తెలగు అశ్విన్యాది నక్షత్రములను భార్యలను గా ఇచ్చిన మామ (2) (దక్షుడు), అతని యజ్ఞాన్ని నాశనం చేసి, గర్వమడచినవాడు ఈశ్వరుడు, ఆ శివునికి మామ(3) (=హిమవంతుడు)ఆ హిమవంతుని కుమారుడైన i) మైనాకుని-కివిరోధి=ఇంద్రుడు అతని నందనుని నందను-సుందరి=ఆ దేవేంద్రుని కుమారుడయిన ii) అర్జునుని కొడుకైన iii) అభిమన్యుని-భార్య (సుందరి) ఉత్తర, ఆమెకు -మేనమామను చంపిన జెగజెట్టి=ఆ ఉత్తరకు-మేనమామ (4) యగుకీచకుని-చంపిన శూరుడు=భీముడు, (ఆ భీముని) పట్టిన్-బొడి చేసిన శూరుని-తండ్రిన్=ఆ భీమ పుత్రుడు (పట్టి-కొడుకు) iv) అగు ఘటో

త్కుచవి-పిండిచేసి చంపిన శూరకుమారుడు (v) కర్ణుడు, అతని తండ్రి సూర్యుడు, (అతనిని) కన్నుగన్-కొవిన=ఆ సూర్యునొక కన్నుగా గ్రహించిన, సుర+అధినాథుని = దేవదేవుడగు విష్ణువుయొక్క,తనూభవుని ఆయువు = కొడుకగు (vi) బ్రహ్మదేవునియొక్క ఆయుస్సు, బ్రహ్మాయువు, అనగా మిక్కిలి దీర్ఘమయిన ఆయుస్సు, మీకున్-అయ్యెడున్ = మీకు కల్గుగాక– 'సుదీర్ఘాయు రస్తు' అని ఆశీర్వచనము.

వి. దీనిలో చిక్కిన పెద్దలగు 'మామ'లను, పిన్నలగునందనులను అనేక పూర్వగాథలను, వెదకి వెలికి దీసి, పాఠకులు పరమానందము నొంద ప్రార్థితులు.

### 92. "బ్రహ్మ ఆలిత్రాడు బండిరేవునద్రెంప"

ఆ. విత్తమొకని కిచ్చి వితరణశీలమా
చిత్తమొకని కిచ్చి చెరచినాడు
బ్రహ్మయాలిత్రాడు బండిరేవున ద్రెంప
రెండు నొకని కీక బందుచేసె ॥

సృష్టికర్తయగు బ్రహ్మదేవుడుకూడ కొన్ని తప్పులు చేస్తాడు, చూడండి, ఆ బ్రహ్మ,దాతృబుద్ధిలేని లోభికి,అపార ధన(విత్త)మిచ్చాడు. దాన (వితరణ) శీలమును మరొకనికిచ్చి, అతనివద్ద ధనంలేకుండా దరిద్రునిగా చేసి, మహాపరాధం చేశాడు. విత్తాన్ని, వితరణశీలాన్ని ఒకనికే ఇస్తే ఎంత బాగుండేది? ఆ మంచిపని చేయనందు కొక దరిద్రనారాయణుడగు కవి, ఆక్రోశాన్ని అపుకోలేక, తెలుగు జానపదుల కలవాటైన నుడికారంతో 'వాని ఆలి (సరస్వతి)మంగళసూత్రం (త్రాడు) తెగాలని, తెగవేసి, తిట్టటం ప్రారంభించాడు.

### 93. "వసుధలో లేడు మాబావపంటివాడు"

తే. అందమున జూడ రాముబం టైనవాడు,
నాగరకతను జము వాహనమున కీడు,

శుచికి హేమాక్షుజంపిన శూరుజోడు
'వసుధలో లేడు మాబావవంటివాఁడు' ॥

లోకంలో, బావ, బావమరదుల పకపకలు, వికవికలు, వేళాకోళాలు, సరసాలు సుపరిచితాలే. ఈ పద్యంలో, తనబావ నొకరు వ్యాజస్తుతి చేస్తున్నారు.

అందంలో మా బావ చాలా గొప్పవాడు. ఈ అందచందాలలో,అతనితో పోల్చదగినవాడొక్క హనుమంతుడే. రాముబంటు - అనగా, మా బావ కోతి' వంటివాడుసుమా! ఇక, నాగరకత, సంస్కారాల్లో చూద్దామా, అంతే,యముని వాహనమే (దున్నపోతే) అతనికి ఈడుజోడు పరిశుద్ధి విషయంలో పరికిస్తే, మా బావ, హిరణ్యాక్షుని జంపిన, 'వరాహావతారం' (పంది)తో సమానమైనవాడన్నమాట, కనుక మా బావవంటి (కోతి,దున్నపోతు, పందివంటి)వాడు కలియుగంలో. కంచుకాగడా పట్టుకొని వెదకినా, దొరకదన్నమాట.

వి. నిందాస్తుతులతో స్తుతినిందలు వ్యక్తమైనచో వ్యాజస్తుత్యలంకారము. ఇక్కడ, పైపైన, బావస్తుతి కన్పడుచున్నా, అంతర్గతంగా నిందవ్యక్తమగుచున్నది.

### 94. ఆద్యంతిమాది మధ్యమ వర్ణములలోన....

సీ. ఆద్యంతి మాదిమధ్యమ వర్ణములలోన
జోడును, సూదయును గూడవలయు
ఆద్యంతిమాదిమధ్యమ వర్ణములలోన
నదియు, ఖడ్గంబునుబొందలవలయు,
ఆద్యంతిమాదిమధ్యమ వర్ణములలోన
రూపంబు, ధూపంబు దోపవలయు,

ఆద్యంతిమాదిమధ్యమ వర్ణములలోన
ఎల్ల, విషంబు రంజిల్లవలయు
తే. అన్నిటికిగూడ మూడేసి యక్షరములు
మరియు, నా యుత్తరంబులే క్రమంబుగాను
కుంభమును, నిసుకయును, వకుళము, పాము
గావలె సుమండి ధీరాగ్రగణ్యులార!

N. B. మూడక్షరాలుగల ప్రత్యుత్తర పదాలయొక్క. 1. ఆది+అంతిమ, 2. ఆది-మధ్యమ అక్షరాలను కలిపిన, వేర్వేరుగా, రెండర్థాలు, తర్వాత కలిసిన మూడక్షరాల పదాలకు మరొక అర్థము క్రమంగా రావాలని, విషమషరతులు.

1. ఉ. కడవ. ప్రథమపాద ప్రత్యుత్తరం 'కడవ'కాగా, దీని మొదటి + చివరి అక్షరాలను కలిపిన, 'కవ' = జంట, జోడు, అర్థాలను, ఆది+మధ్యమాక్షరాలను కలుపగా వచ్చిన, కడ=సుద(చివరి) అను అర్థాన్ని తెల్పుతుంది. ఇక్లే, ఈ జవాబు క్రింది పద్యములోని, కడవ='కుంభం' (కుండ) అనే అర్థాన్నికూడ తెల్పుతుంది. ఈ విధంగానే మిగతా మూడు పాదాలకు అర్థాలను గమనింపవలెను.

2. ఉ. 'వాలుక', దీని మొదటి చివరి అక్షరాలను కలిపిన వాక= నది. మొదటి మధ్యమాక్షరాలను కలిపిన,వాలు=కత్తిని,షరల. వాలుక= 'ఇసుక'-మతెల్పుతుంది.

3. ఉ. 'పొగడ'' దీని ఆద్యంతాలు-'పొడ'=చూపు,గుర్తును, ఆది మధ్యమాలు 'పొగ=ధూమము, అవిరిని, పొగడ='వకుళ'వృక్షాన్ని తెల్పును.

4. ఉ. 'గరిడి' దీని ఆద్యంతాలు 'గడి'=ఎల్ల-మేరను, ఆదిమధ్యమాలు 'గరి (గరము-విషము గలది) పామును, మొత్తంగా, గరిడి = పాము—అర్థాన్ని చక్కగా తెల్పుతోంది.

## 95. ఆద్యంతమధ్యమాంతాది వర్ణంబుల....

సీ. ఆద్యంత మధ్యమాంతాది వర్ణంబుల
1 తేటి 2 రక్కసిరాజు, తెలియకిదల్లి,
ఆద్యంత మధ్యమాంతాది వర్ణంబుల
శివునిల్లు, వరిచేను, క్షీరధార
ఆద్యంత మధ్యమాంతాది వర్ణంబుల
భార్యయు, ఖడ్గంబు, పాదపంబు
ఆద్యంతమధ్యమాంతాది వర్ణంబుల
మార్జాలి, బూజి, ధూమంబు దనరు

తే. అన్నిటికిజూడ మూడేసి యక్షరములు
మొదలు తుదలును, నడితుది, మొదలు నడుము,
ప్రాణరక్షను, లతలను, పాదకముల
బరికరములంద యీపదా, లమరవలయు

జవాబులు : 1. అంబలి=అలి, బలి, అంబ 2. గుమ్మడి=గుడి, మడి, గుమ్మ 3. ఆవాలు=ఆలు, వాలు, ఆవ 4. పొగడ=పొడ, గడ, పొగ.

N. B. పై పద్యంకంటె దీనిలోని విశేషమేమనగా, దీనిలో 1. ఆది-అంత 2. మధ్యమ—అంత, 3. ఆది—నడుమ-లను విడగొట్టి, మూడు అర్థాలు, అన్నీ కలిసిన మూడక్షరాల పదానికి మరొక అర్థం రావలెను.

1వ పాదానికి జవాబు 'అంబలి'. దీనిని పైవిధంగా మూడుగా విడగొట్టిన, 1. అలి=తుమ్మెద, 2. బలి=రాక్షసరాజగు బలిచక్రవర్తి

3. అంబ=తల్లి 4. అన్నీ కలిసిన మూడక్షరాల పూర్ణపదం 'అంబలి'= ప్రాణరక్షణచేయు 'జావ'ను తెల్పును.

2. ఉ. గుమ్మడి, విడదీయగా. 1 గుడి=శివాలయం, 2. మడి= వరిచేను, 3. గుమ్మ = గుమ్మపాలు, 4. మొత్తంగా ఒక తీగ - ను తెల్పుతాయి.

3 ఉ. ఆవాలు, విడదీయగా-1. ఆలు=భార్య, 2. వాలు=కత్తి, 3. ఆవ=ఒకచెట్టు, 4. మరల మొత్తంగా పాదపము (వృక్షము)లను తెల్పును.

4. ఉ. పొగడ, వీనిని ఛేదించిన. 1. పొడ=ఒకరంగు, 2.గడ= ఈటె. 3. పొగ=ధూమము, 4. పొగడ= ఉపకరణము లేక పరికరము.

వి. విడిగా మూడర్థాలు, మొత్తం కలిపిన దానికొకటి, వెరసి 4 అర్థాలు రావటం ఈ పద్యంలోని విశేషము.

## 96. కొన్ని సమస్యలు : "పందే నా కిష్టమనుచు బాపడు పలికెన్"

క. పొందూర నొక్క విప్రుని
విందుకు రా బిలిచి, నీకు వేడుక తోడన్,
ఇందెందు నిష్టమనగ, పప్ +
"పందే నాకిష్ట మనుచు బాపడు పలికెన్"

వి. సమస్యలు విషమ ప్రహేలి(క)కలు. విశిష్ట,విపరీతార్థాంతరాలతో కవి యొక్క, తెలివిని, పాండిత్యాన్ని ప్రశ్నిస్తాయి. ఎంతో సద్యఃస్ఫూర్తి నేర్పు, పాండిత్యం కలవాడై తేగాని, ఆ సమస్యలను పూరింపలేడు. సాధారణంగా, నాల్గవ పాదాన్నే సమస్యగా ఇస్తారు. కాని,ఏ పాదమైనను ఇవ్వ వచ్చును. పాద భాగమునిచ్చిన సమస్యలు కూడ ఉన్నవి. పూరించటం లోనే ఉన్నది పూర్ణ ప్రభుత్వం. ఇక్కడ, బ్రాహ్మణునికి పంది, పంది

మాంసమో ఇష్టమంటారా? అని, కర్తపై కఠోరంగా విరుచుకుపడకండి. పదచ్ఛేద విభాగంతోనో, మరొక విధంగానో ఊహించి, పూరించి, అవ ధాని సభారంజనం చేయాలి.

ఒకానొక బ్రాహ్మణుని, పొందికతో విందుకు ఆహ్వానించి, వండిన ఆయా పదార్థాలను చూపించి, వీనిలో నీకేది ఇష్టమని అడుగగా, పప్పందే= పప్పు+అందు-ఏ = ముద్ద-పప్పునందే, నాకిష్టమని చెప్పెనట.

ఇక్కడ, గమనార్హ విషయమేనగా-'పప్పందే....లోని పప్' అను నది మూడవ పాదాంతంలోనిల్చిపోగా, మిగిలిన 'పందే....' నాల్గవ పాదా దిలోనిల్చి, పాఠకునికి పరమభ్రాంతిని కలిగించినది. నిపుణుడగు కవి, దానిని చక్కగా పూరించటంతో, ఉత్కంఠ, ఉబలాటం తగ్గి, ఆనందం అధికంగా కలుగుతుంది.

మరొక పృచ్ఛకుడు, వేరొక చిత్ర సమస్య నిట్లిచ్చెను.

**97. "కమల బాంధవు డేతేర కలువ విచ్చె"**

తే. 1 విష్ణుదేవుని పత్నియై వేలయు నెవతె?
2 ఎవ్వరెతేర పాద్యాదు లిచ్చు చుంద్రు?
3 హిమకరుడు పుట్టగా, రాత్రి ఏది విచ్చె?
1 కమల, 2 బాంధవుడేతేర, 3 కలువవిచ్చె॥

వి. సూర్యోదయం కాగానే, కలువ మూసుకొంటుందని కవి సమ యం, అనుభవం చెప్పగా, పృచ్ఛకుడు వికసించినదని చెప్పటం విపరీతంగా లేదా? కనుక, అవధాని అప్రమత్తంగా ఆలోచించి, పైమూడు పాదాలలోని మూడు ప్రశ్నలకు, పై సమస్యను వరుసగా చీల్చి, సమాధానంగా, సమ న్వయించి, చెప్పుకొన్న సరిపోవును. ఎట్లు ?

1వ ప్రశ్న: విష్ణు భగవానుని భార్య ఎవరు? 4వపాదాదిలోని 'కమల' (లక్ష్మి)

2. ఎవరు వచ్చినపుడు అర్ఘ్య పాదాదులిచ్చి ఆదరింతురు? ఉ. బాంధవుడు-ఏతేరన్ = బంధువు రాగా, అర్ఘ్యపాద్యాదులిచ్చుట ఆచారము.

3. చంద్రోదయంకాగా, రాత్రి ఏది విచ్చును? ఉ. కలువ-విచ్చె= కలువ పూవు వికసించెను.

ఈ పద్యంలోని 3 పాదాలలోని 3 ప్రశ్నలకు 4వపాదాన్ని విడగొట్టి సమాధానంగా చెప్పుకొంటే ఉత్కంఠ ఉడిగిపోతుంది.

### ౪8. రవి గానని చో కవి గాంచునే కదా!

ఉ. ఆ రవి వీరభద్రుచరణా హతిదుల్లిన బోసి నోటికిన్,
నేరడు, రామలింగకవి నేరిచె బో,మనముక్కుతిమ్మరాట్
క్రూరపదాహతిం దెగిన కొక్కరిపంటికిదుప్పికొమ్ముపల్
గా, రచియించినాడు, 'రవిగానని-చో కవిగాంచునే గదా!

సం. కృష్ణరాయల ఆస్థానంలో అష్టదిగ్గజాలుండేవారు. భట్టుమూర్తి బ్రహ్మాండ పండితుడు. రాయలవారికి అతడన్నా, అతని కవిత్వమన్నా మిక్కిలి యిష్టం. తెనాలి రామకృష్ణుడు కూడ సామాన్యుడు కాడు. అయితే 'వికటకవి'గా ప్రసిద్ధుడు. ముఖ్యంగా భట్టుమూర్తి అంటే భగ్గుమనేవాడు.

"చీపర పాపరతీగల-చేపల బుట్టల్లినట్లు చెప్పెడి నీ యీ
కాపుకవిత్వపుకూతలు-బాపనకవివరుని చెవికి ప్రమదంబిడునే?

భట్టుది 'కాపు కవిత్వమనీ, క్షుద్రకవిత్వమనీ, చేపలబుట్టల్ని అల్లినట్లు పద్యాలల్లుతాడని, అవి బాపనకవికి ఇష్టంకావనీ, వినడనీ నిందించెడివాడు.

ఈ ఒక్కసారి మాత్రం కవితా వివాదాల్లో భట్టుమూర్తికి, రామ

లింగం దొరికాడు. ఒకనాడు ముక్కు తిమ్మన, తూగుటుయ్యాలలో ఊగు చుండగా, రామకృష్ణుడు వెళ్ళి, తాతా? 'ఊతునా' అని కొంటెగానడగా, 'ఊతునా' అన్నదానికి, శ్లేషతో రెండవ అర్థాన్ని వెంటనే, గ్రహింపక 'సరే' ఊపుమన్నాడట(ఊతునా? ఊపుమంటావా? అని మొదటి అర్థం. నీ మీద ఉమ్మి ఊయమంటావా "అని రామలింగనిది రెండవ భావం, కనుక, వెంటనే, తిమ్మన మీద 'తుపుక్కున ఊసినాడట! తాతగారికి కోపంవచ్చి, కాలిపావు కోటితో, ముఖంమీద కొట్టగా, రామలింగని పన్నొకటి రాలి పోయింది. మరునాడు రాయల సభకు వెళ్ళవలెనంటే సిగ్గు. వెంటనే దుప్పి కొమ్ము అరగదీసి, పన్నుగా ధరించి సభకు వెళ్లాడు. ఈ రహస్యమెరిగిన మూర్తికవి ఈ పద్యం చదివేవరకు, సభంతా గొల్లుమన్నదట. రాయలే 'రవి గాననిచో కవి గాంచునేగదా' అని, సమస్య నిచ్చినట్లు కొందరు చెప్పుతారు. ఇలా, ఈ పద్యానికొక పూర్వగాథతో సంబంధమున్నది.

పూర్వం దక్షప్రజాపతి అపూర్వయజ్ఞం చేస్తూ, అందరిని పిలిచి, అల్లుడు శివుని పిలువక అవమానపరచెను. యజ్ఞ దిదృక్షతో, సతీదేవి (పార్వతి) ఎట్లో భర్తనొప్పించి, పితృయాగమునకు వెళ్ళగా, దక్షుడు, 'అత్తమీద కోపం దుత్తమీద చూపి'నట్లు, శివునిపైనున్న అక్కసునంతా పార్వతిపై వెళ్ళగ్రక్కగా, అవమానభారంతో సతీదేవి అక్కడే ప్రాణం విడిచినదట! ఈ వార్తవిన్న శంకరుడు ప్రమథగణాన్ని, వీరభద్రుని సృష్టించి, దక్షాధ్వర ధ్వంసం చేయించెను. ఇంతలో వీరభద్రుని కాలికి సూర్యుడు దొరకగా, ఒక్క తన్నుతో సూర్యునిదంతం రాలిపోయెనట.

పాపమా సూర్యుడు, వీరభద్రుని తన్ను తాకిడికి ఊడిన పన్నుకు బదులుగా, కృత్రిమ దంతం పెట్టుకోవడం (ఆ-రవికి) తెలియలేదుగాని, మన రామలింగకవి, ముక్కుతిమ్మన తన్నుకు ఊడిన పంటికి, బదులుగా, దుప్పికొమ్మును పన్నుగా ధరించినాడు. ఆ సూర్యభగవానునికి తెలియని విషయాన్ని కూడ, కవి తన అద్భుతబుద్ధి వికాసంతో తెలుసుకోగలడు సుమా! అను అర్థాంతరన్యాసాలంకారంతో సమర్థించి, వాచ్యంగానిందింపక,

ఆలంకారికంగ, బుద్ధిచెప్పి శాంతించినాడట మూర్తికవి. ఈ సమస్యలో ఇంత రహస్యమున్నది.

మచ్చుకు, మరొక విషయ శృంగార సమస్యనుకూడ విడిచిపెట్టక, అర్థంచేసుకొని, చమత్కార చందనాన్ని చర్చించుకొని, శాంతించండని మనవి.

## 99. ఉద్ధతుల మధ్య పేదల కుండ తరమె?

సం. ఈ సమస్య పం(టం)కుసాల నృసింహ కవిదట! నాల్గువేల వరహాల విలువగలది. ఒకప్పుడు రాయలవారు, తనకుమార్తె 'మోహనాంగి'తో చదరంగ మాడుచుండ ఆమె 'బంటు', రాయలవారి మంత్రికీ, ఏనుగుకు మధ్యలో చిక్కగా, మథనపడుచున్న మోహనాంగి=ఉద్ధతుల మధ్య "పేదల కుండతరమె" అంటూ సందర్భానుసారంగా, ఉద్ధతులగు మంత్రి. మరపుఏనుగుల మధ్య, చిక్కచిక్కిన తన బంటును తలచుకొని, కూనిరాగాలుతీస్తూ గొణుగుకొంటోందట! రసజ్ఞుడగు రాజను ఆ పద్య పాదం మోహపెట్టడంతో ఆ పద్యాన్ని కూడ పూర్తిగా చదువుమన్నారట. సిగ్గుతో తలవంచుకొని, తాను నృసింహకవివద్ద, నాలుగువేల వరహాలిచ్చి, కొనిన పద్యమున్న తాళపత్రాన్ని అందించినదట.

రాయలా పద్యాన్ని —

తే. ఒత్తుకొనివచ్చు కటితటోద్వృత్తి చూచి,
తరుణి తను మధ్య మెచటికో తొలగిపోయె,
ఉండెనేనియు కనబడకున్నె? అహహ!
ఉద్ధతుల మధ్య పేదల కుండ తరమె?

యౌవనంలో, ఒకిపిడి చేసుకుంటూ, మీది మీదికి పెరిగి వస్తున్న పిరుదుల విజృంభణాన్ని చూచి, పాప మాయువతియొక్క నడుము, ఎచ్చటికో లేచి పారిపోయిందట! అది సాధ్యమా? అని ఉత్ప్రేక్షించి, ప్రశ్నిస్తే, ఆహా! అక్కడ, ఆ నడుము గనుక ఉంటే, కన్పడకుండా ఉంటుందా?

అని చెప్పి, క్రింది, అర్థాంతరన్యాసంతో, కవి సమర్థించినాడు, గర్వంతో మీదమీదకు వచ్చే ఉద్దండులగు వారి మధ్యలో (వారి దగ్గర) నిరుపేద యుండుటకు వీలగునా? అని భావం.

వి. కవీశ్వరులు కాంతయొక్క నడుము సన్నగా ఉండుటచే, అతిశయోక్తితో, 'వదసత్సంశయగోచరం (ఉన్నదా లేదా? అన్నట్లు) అని, పిడికిలితో ఉదరాన్ని కొలువవచ్చునంత సన్నగా ఉంటుందని వర్ణిస్తారు. ఆ సంప్రదాయాన్నిక్కడ అన్వయించుకొని, ఆనందించాలి.

## 100. "సారము దెల్పుమీ సురత సౌఖ్యమెరింగిన జాణవై నచో ?"

ఉ. ఊరువులంటరా దిగిచి, యున్నతమైన కుచద్వయంబుపై
చీరచెరంగుదీసి, సతిజేరి, చనుంగవ బిగ్గబట్టి, తా
గోరిన కోర్కె దీర్చుకొనె, కోమలి బొందక యున్న
మాత్రనే
సారము దెల్పుమీ—సురతసౌఖ్యమెరింగినజాణవై నచో?

N. B. పద్యాన్ని పైకి చదవంగానే, ప్రతి పాదంలోని పదాలు 'రేప్' (Rape) చేసినట్లు, అశ్లీలార్థాన్ని స్ఫురింపజేసి, వెగటు పుట్టించి, పాఠక మహాశయుల మనస్సుకు మసిపూస్తున్నట్లు కన్పడతాయి. అంత తొందరపడితే ఎలా? కొంచెం నిదానంగా, దాని అసలగు అంతరార్థాన్ని పట్టి, పైకిలాగితేగాని, అశ్లీలార్థం ఆమడ దూరం పోదు.

పద్యం చదవంగానే, తోచేభావం, ఒకడు (కాముకుడు) తొడలు పట్టి, ఎత్తయిన చనుగట్లపైనున్న చీరనులాగి, ఆడుదాని (సతి—పెంటి) ప్రక్కజేరి, రెండు చన్నులను గట్టిగా లాగిపట్టి, ఆ కాముకుడు తన కోర్కెను తీర్చుకొనెను. ఇక్కడ, దానిని (ఆమెను) పొందకపోయినంత మాత్రాన వచ్చిన నష్టమేమి? నీవే గనుక, నిజంగా సంభోగ సౌఖ్యము

నెరిగిన రసికుడవు (జాణ = నేర్పరి) ఐనచో, నేనడిగిన పై పద్యంలోని అంతఃసారమును, రహస్య భావమును కనిపెట్టి సిగ్గుపడకుండ, తెల్పుము.

ఉత్తరం : ఇక్కడ, ఒక గొల్లవాడు గొఱ్ఱెపాలు పిదుకుట దీని లోని సారము. ఆ రహస్యాన్ని చేదించి, చెప్పేవరకు ఆగక, అర్థంలేని బూతు కతలకు బుక్కా (గంధ చూర్ణం) కొట్టి, బూమేలాడుతారా? అవి, అఖ్యాత, వ్యాఖ్యాతలపై, ఆగ్రహించితే ఎలా? అఖ్యాత అన్ని రహస్యాలు దాచకుండా చెప్పి, అనర్థాన్ని తప్పించాలి గదా! ఎట్లు?

తాత్పర్యం : గొఱ్ఱెపాలు పిదుకబోవునపుడు, తనను, తన్నకుండుటకై, గొల్లడు పెంటిగొఱ్ఱె కాళ్ళు లాగి, తన తొడల సందున పెట్టుకొని, గొఱ్ఱె పిల్లను చూడగనే, చేపుచే ఉబ్బిన, దాని చన్నుల జంటపై నున్న 'ఉప్పు పాతగుడ్డ' (చీరచెరంగు)ను తీసి, స్తనములను గట్టిగా పట్టి, పిండి, తనకు కావలసిన పాలు తీసుకొనెనని, అసలైన అర్థం.

వి॥ గొఱ్ఱె పిల్లలు ఎప్పుడు పడితే అప్పుడు, పాలుత్రాగకుండుటకై, గొఱ్ఱెల రెండు చన్నులకు, ఉప్పులో నాన్చిన, చిన్నగుడ్డలను అతికిస్తారు. అందుచే పిల్లలు ఆ వాసనకు, రుచికి, భయపడి,పాలుత్రాగుటకు ముందుకు రావు. ఇట్లున్న, అసలు అర్థాన్నెరిగి, అశ్లీలాభాసాన్ని తొలగించు కోవాలి.

## 101. "కీర్తి యొప్పె... కరిబిద్గిరిభి త్తురంగ కమనీయంబై"

క. నరసింహ కృష్ణరాయని
కర మరుదగు కీర్తి యొప్పె, కరిభి ద్గిరిభిత్
కరికరిభి ద్గిరి గిరిభిత్
కరిభి ద్గిరిభి త్తురంగ కమనీయంబై ॥

సం. 1 : అష్టదిగ్గజాలలో అన్యతముడైన భట్టుమూర్తి కవి, కమ్మచ్చున దీసినట్లున్న, ఈ శబ్దచిత్ర, చమత్కారాలతో, కమ్మగానున్న

పై పద్యాన్ని ఆశువుగా చెప్పగా, రాయలు మెచ్చి తన మెడలో నున్న అమూల్య తారహారాన్ని కాన్కగా నిచ్చెనట !

అర్థము : కృష్ణరాయని, — కరము - అరుదు - అగు = మిక్కిలి ఆశ్చర్యకర-మైన, కీర్తి,కరిభిత్ = గజాసురుని సంహరించిన శివుని వలెను, గిరిభిత్ కరి = పర్వతముల రెక్కలను భేదించిన ఇంద్రుని యొక్క ఏనుగగు ఐరావతము వలెను, కరిభిత్-గిరి = ఈశ్వరుని కైలాస పర్వతము వలెను, గిరి-భిత్ = కొంకలను భేదించిన-వజ్రాయుధము వలెను, కరిభిత్—గిరిభిత్-తురంగ = ఈశ్వరుని-ఇంద్రుని వాహనములగు నందీశ్వర-ఉచ్చైశ్శ్రవముల వలెను, తెల్లగా, ధగద్ధగాయమానమై, కమనీయంగా ఒప్పి, కన్పించెను.

లేక, రాయల కీర్తి, కరిభిత్ = ఈశ్వరుని వలెను, గిరిభిత్ = వజ్రాయుధము వలెను, కరికరి-భిత్ = గజేంద్రుడైన ఐరావతము వలెను, గిరిగిరి-భిత్ = గిరీంద్రమైన రజతాచలము వలెను, కరిభిత్-గిరిభిత్-తురంగ కమనీయంబై = ఈశ్వర-దేవేంద్రుల వాహనాలగు నందీశ్వర, ఉచ్చైశ్శ్రవముల వలెను, తెల్లగా, మనోహరమై ప్రకాశించెను.

వి. 1. దీనికి విభిన్న పదచ్ఛేదంతో అర్థాంతరములు కూడ రాగలవు. 2 ఈ పద్య స్ఫూర్తితో, మరికొన్ని పిల్ల పద్యములు కూడ సృష్టింపబడినట్లున్నవి.

**102.** "ఒకరా ! ఇద్దర ! ముగ్గురా....ఉన్నార లెందెందరో?"

ఒక తాతంగని 'యూతునా?' యనుచు
పైనుమ్మేసితిన్, ప్రెగ్గరాట్
సుకవీంద్రున్ విరసా! తుసా! బుస! యటంచు
దిట్టితిన్, దోషకు

త్రుకలో నెక్కడజొచ్చె "లంజెకొడకా!"
దుర్దాంతమహా కుంజర
ప్రకరం బం చొక పంజితున్ దెగడితిన్,
పంతమ్ము దీపింప పి
ల్లికి పాల్పోయక నేన త్రావి, యిసి!
పాలే యొల్లదీ పిల్లి కూ
నకటా! యంచును దాని మాడ్చితిని,
నానా బ్రాహ్మణ వ్రాత మిం
టికిరాన్, మజ్జనయిత్రి చచ్చెనడ తండ్రీ!
వాతలో వాతలం
చు కనుల్ మూసిన దంచు, వీపుపయి బెచ్చుల్
లేవ నంటించితిన్
ఒక యుద్దండుని బట్టి యర్థమది యేదో
తేల్చుమీ యంచు మే
కకు తోకా తొక తోక మేక తొక తోకా
యంచు వల్లించి, గ్రు
డ్లకు నీర్దిర్గ నొనర్చితిన్, వికటలీలన్ -
మత్పురా భూతులి
ట్లొకరా! ఇద్దర! ముగ్గురా! నలుగురా!
ఉన్నార లెందెందరో?

సం. ఆవధాన శిరోమణులగు శ్రీ గాదేపల్లి కుక్కుటేశ్వరరావు గారికి "ఒకరా! ఇద్దర! .... ఎందరో" అన్న సమస్యనీయగా వారు పూరించిన విధానమిది. సాధారణంగా, చాల సందర్భాల నెరుగుటకు పురాణాల కోసం, పూర్వ గాథాలహరుల కోసం పరుగెత్తాలి. కాని, రావు

గారిచ్చిన ఐతిహ్యాల కోసం 'కవి చరిత్ర'లను కలియ తిప్పాలి. మరొక విశేషమేమిటంటే, రావుగారు తమను తెనాలి రామకృష్ణునిగా భావించుకొని, సమస్యను పూరించడం. ఇదొక విశేషాంతరం కాదా?

తన నెదుర్కొన్న ఒకరినా? ఇద్దరినా? ఎందరినైనా, ఏదో విధంగా తన వికట కవిత్వంతో వెంగలివిత్తు (మూర్ఖు)లను చేసి వెక్కిరించటం, రామకృష్ణునికి వెన్నతో వచ్చిన విద్య. ఆ విధానాలెట్టివో తానే స్వయంగా చెప్పుకొంటున్నాడు.

1. ఒక తాత 'ముక్కు తిమ్మన'ను 'ఊతునా?' (నీ ఉయ్యాలను ఊగింతునా? లేక నీపై 'ఉమ్మి' వేయుదునా?) అని శ్లేషతో చెప్పి, వానిపై 'ఉమ్మి' వేసినాను.

2. పెద్దనాదుల కవిత్వంలో, తప్పులెన్నిన 'నరసరాజ కవి'ని, యాసగా "తృవ్వట బాబా తలపై...." పద్యంచెప్పి, వ్రాయలేకుండునట్లు గాను, మరల, నా యొక్క "గగనీహారగు రామపద్మ...." పద్యంలో తప్పులుపట్టి గేలిచేసినందుకు, "నా ఉచ్చారణలోని ఏకారాన్ని విడమర్చ లేకుండ చేసి, 'నా కవిత్వ మందొకనికి తప్పుపట్ట పనియుండ'దనీ, అట్లయిన "....సిక మొదలంట గోయుమను, చెప్పున గొట్టుదు, మోము దన్నుదున్" అనీ, "పెద్దలైనవారల విరసింతువా? ప్రెగడ రా ణ్ణరసా! విరసా! తుసా ! బుస !"అనియు బెదిరించి (ఎచించి, వంచించి) తిట్టినాను.

3. "కుంజర యూధంబు దోమ కుత్తుక జొచ్చెన్" సమస్య నిచ్చిన 'భట్టుమూర్తి కవి'ని, "గంజాయి త్రాగి.... ఒంజల కొడకా? యెక్కడ? కుంజర యూథంబు దోమకుత్తుక జొచ్చెన్" అంటూ, తెగతిట్టినాను.

4. పిల్లిపాలకై ఇచ్చిన ఆవుపాలన్నీ నేనే త్రాగి, పిల్లిని మాడ్చినాను.

5. ఏదో ఒకమిషతో,రాయలవద్ద బంగారు మామిడిపండ్లనుపొంది, బోడు పాఱులను (బ్రాహ్మణులను) పిలిచి, నా తల్లి 'వాతలో వాత'

లనుచు, కళ్లు మూసినదని, విప్రుల వీపున, కాల్చిన కఱ్ఱలతో, వాత లంటించినాను.

6. "రాజనందన రాజ రాజాత్మజులు సాటి...." అను పద్యం చదివి, అర్థం చెప్పుమన్న పండితకవిని, ముందు, నా "మేక తోకకు తోక, తోక మేకకు తోక...." ఇత్యాది పద్యావి కర్థం చెప్పు"మని, నిలదీసి, మరునాడు సభకు రాకుండ, పలాయన మంత్రం పఠింప జేసినాను........

ఇట్లు, ఒకరా! ఇద్దర! ముగ్గురా! నలుగురా! ........ ఇట్లెందరినో ఎదుర్కొని, చిత్తుచేసి, పారద్రోలినాను సుమా!

వి. ఈ చక్కని సమస్య, చిక్కని క్రొత్త ధోరణిలో దొర్లింది. దీనిలోని సత్యాసత్యాలెట్లున్నను, మొత్తంమీద, తెనాలి రామకృష్ణుని అప హాస్యాన్ని, సమయస్ఫూర్తిని, చమత్కారాన్ని చర్చించుకొని, చేతో మోదము పొందని వారుండరనుట సత్యేతరము గాదుగదా!

103. ముండనుంచుకున్న వాడు 'బ్రహ్మచారి'
గుడిసె్రవేటు నుంచుకొనుటచే పెండిలి
కానివాడు, పెండ్లికాక ముండ
నుంచు కున్న వాడు, నుర్విపై విలసిల్లు
'బహ్మచారి' యనగ, ప్రమథనాథ!

నేటి ఘూ్రపపంచంలో 'బహ్మచారి' అనగా, ఏవతెనో ఒక వేశ్యను (భోగము దానిని, గుడిచేటు దానిని) దగ్గరకు చేర దీయుటచే, పెండ్లికాని వాడు. అట్లే, ఎవరు పిల్చి పిల్ల నీయ నందున, వివాహం కాకపోవటంతో ఉంపుడుకత్తెను (మోసముచేయునది, విధవ........) ఉంచుకున్న వాడు 'బ్రహ్మచారి'గా చెలామణి యగుచున్నాడు.

104. 'తత్త్వవేత్త'కు గంజాయి దమ్ముకాడనంగ నభిఖ్య...

'అప్రయోజకుడు' నా, 'అవివేకి'యన రెండు
సంకేతములు చెల్లు సజ్జనునకు,
'రండ' యన, 'నపుంసకు'డన నాఖ్యలై
ఎసగుచుండును విజితేంద్రియునకు,
'ఛాందసుం' డన, 'వేదజడు'డన నామముల్
బరగు సదాచార వర్తను నకు,
'స్నేహదూరుం'డన, 'చెనటి'నా అభిధలై
ప్రాలుచుండును సత్యశీలునకును,
వరగు 'పిసినిగొ'ట్టనగ, 'పిశాచి' యనగ
ద్రవ్యశాలి కభిఖ్యలై ధరణియందు,
'తత్త్వవేత్త'కు గంజాయి దమ్ము కాడ-
నంగ నభిధేయమై యొప్పు నంగజారి!

సం. 'విపరీతే లక్షణా' అను న్యాయంతో, అవినీతి, అజ్ఞానం, దౌష్ట్యం ప్రబలిన ఈ లోకంలో, కొన్ని మంచి పదాలకు విరుద్ధార్థాలువచ్చి నవవి, బాధపడుచు, కవి భగవంతునికి (మన్మథుని దహించిన శివునికి) తన మొఱ్ఱవిట్లు విన్నవించుకొనుచున్నాడు.

సం. లోక వ్యవహారంలో కొన్నిమంచి పదాలకు మారిన అర్థాలు-

1. సత్పురుషునకు 'అప్రయోజకుడు' (పనికిమాలినవాడు) 'అవివేకి' (తెలివి లేనివాడు) అనియు, 2. ఇంద్రియ నిగ్రహం గలవానికి 'రండ' (రమించువాడు) అని, 'నపుంసకుడు' (మగతనము లేనివాడు) అని పేరులు పెట్టినారు. ఇక 3. మంచి-ఆచార-సంప్రదాయములననుసరించు వానికి, 'ఛాందసుడు' (చాదస్తం గలవాడు), 'వేదజడుడు' (వేదాలనభ్య

సిస్తూ, అర్థం తెలియని మూర్ఖుడు)అని, 4. సత్య స్వభావం గలవాడు, సూటిగా నడచుటచే, వానికి 'స్నేహదూరుడు' (మైత్రిని పాటించనివాడు) అని, 'చెనటి' (వ్యర్థుడు, దరిద్రుడు....) అనీ అంటారు. మరియు, 5. 'ధనవంతు'నికి, డబ్బెవ్వరికి దానం చేయక, దాస్తున్నందున, 'పిసిని గొట్టు' (పీనాసివాడు) అనీ, 'పిశాచి' (దయ్యము) అనీ, 6. తదేకధ్యానంతో యథార్థ జ్ఞానాన్ని తెలుసు కొనుటకు ఆలోచించు 'తత్త్వవేత్త'ను 'గంజాయిదమ్ము కాడు! ('గంజాయి 'అను మత్తు పదార్థాన్ని సేవించటంతో మత్తెక్కి కళ్ళు మూసుకొన్నవాడు) అని, ఇట్లు, మారుపేర్లుపెట్టి పిలుస్తారు.

**105.** 'సన్న్యాసి' యనగ మహినొప్పు శివా!

దినమెల్ల బిచ్చమెత్తుట - యును,
నిశలం దెల్ల చౌర్యమొనరించుటయున్
పనిగల హిందూదేశపు-మనుజుడు
'సన్న్యాసి' యనగ, మహినొప్పు శివా!

పగలంతా అడుక్కొంటూ, రాత్రులందెల్లపుడు దొంగతనం చేయటమే పనిగా భావించు భారతీయుడు, లోకం దృష్టిలో నేడు 'సన్న్యాసి' (సన్నాసి)గా కన్పడు చున్నాడు- అని గమనించవలెను.

వి. సన్న్యాసి=అన్నిటిని బాగుగా, విడిచిపెట్టి, నిష్కామంగా, నిర్మోహంగానుండువాడు అని, అసలు అర్థం.

**106.** చావుపెండ్లొక్క సమయమ్మె జరుగునపుడు
సంభావ నేదంచు సకలబ్రాహ్మణులేడ్వ
తాంబూల మేదంచు తరుణులేడ్వ
బాజా బజంత్రీలు బత్తెములకునేడ్వ
పప్పుకూటికి పెండ్లి వారలేడ్వ,

రెండవ పెండ్లంచు పెండ్లికూతురు నేడ్వ
పోరి చిన్నది పెండ్లిపోర డేడ్వ,
వచ్చిన చుట్టాలు ఫలహారములకేడ్వ
ము తైదులందరు బొట్టుకేడ్వ
చావుపెండ్లని డప్పుచాటు వారలు నేడ్వ
బ్రతుకుపీస్గను మోయు రజకు లేడ్వ,
చేసె నీ పెండ్లి దేవరసెట్టి రాము
డార(రు)దిన వారముల కేము నరగినాము,
టంచు రూపింప మొదలిడి రఖిలజనులు
'చావు పెండ్లో'క్క సమయమ్యో జరుగునపుడు

సం. దేవరసెట్టి రాముడనువాడు తన కూతురును రెండవ పెండ్లి వానికిచ్చి పెండ్లిచేసినపుడు, వసతులు వగైరా సరిగా లేకపోవుటచే, ఆ పెండ్లికి వచ్చినవారందరు తమతమ గోడును చెప్పుకొంటూ, ఇది చావు పెళ్ళి బాబూ! అని విందిస్తూ, ఏడవటం మొదలుపెట్టినారట! ఎవరు ఎలా ఏడ్చినారంటే—

1 ఆ పెండ్లికివచ్చిన బ్రాహ్మణులందరు మాకు 'సంభావన' (సమ్మానము, గౌరవము, దక్షిణ)ఏది అంటూ ఏడ్వటం మొదలుపెట్టగా, 2 వచ్చిన యువతులు మాకు తాంబూలమన్నా సరిగా ఇవ్వలేదని ఏడ్చా రట! 3 మేళాలు వాయించినవాళ్ళు తమ కూలికి, 4 పెండ్లికి వచ్చినవారు పప్పుభోజనానికి ఏడ్చారట! 5 పెండ్లికూతురు నన్ను రెండోపెళ్ళివానికిచ్చి పెండ్లిచేస్తున్నారని, 6 ఆ పెండ్లికొడుకు (పోరడు)పెండ్లికూతురు (పోరి) చిన్నదంటూ ఏడ్చారట. (వి. చిన్నపిల్లలకు తెలంగాణాలో 'పోరి, పోరడు' అనే పదాలను, స్త్రీ, పుం లింగాలలో వాడుతారు) 7 వచ్చినచుట్టా

లందరు, కాఫీ, ఉప్మా మొ. పదార్థాలేవీ అందలేదని, ముత్తయిదువ లందరు బొట్టయినా పెట్టలేదని ఏడ్చారట! 9 ఇది 'చావుపెళ్ళి' అని డప్పు కొట్టేవారు, 10 ఈ బ్రదికిన శవాలనెట్లా మోస్తామని చాకలివారు ఏడ్వటం మొదలుపెట్టారట!

ఇట్లా, పెండ్లికి వచ్చినవారందరు, ఈ శనిగ్రహం శ్రాద్ధకర్మలకు (ఆర-దినవారములు) మేమువచ్చి నలిగి, నశించామంటూ, పరిపరి విధాల పలవిస్తూ ఉండగా ఆ సమయంలో '1 చావూ 2 పెండ్లి' రెండూ ఒకేసారి జరిగినట్లున్నవట!

## 107. కాటయ వేమన బోలు....

ఉ. 1 మానుష 2 దాన 3 మాన 4 బల 5 మానితధర్మ
6 రమా 7 మనోజ్ఞ రే
ఖానుతి 8 భూతి 9 విత్తముల, 'కాటయ వేమనబోలు, 1 వాసవిన్
2 వానివిరోధి 3 వానివిభు 4 వానివిపక్షుని 5 వాని యగ్రజున్
6 వాని మరంది 7 వానిసుతు 8 వానియమిత్రుని 9 వానిమిత్రునిన్॥

N.B 1. ఈ పద్యంలో యథాసంఖ్యాలంకారమేకాక, మాలారూపంలో నున్న అనేక ఉపమాలంకారములుకూడ కలవు. అంతేకాక, ఇక్కడపాదాంత పదం పునరుక్తంకాకపోయినా, సర్వనామ మగు 'వాని' అనే పదాన్ని ముక్తపదంగా పలుమారు గ్రహించి. చమత్కారంగా, విభిన్న విశిష్టార్థాలను ఉగ్గడించటంవలన, ముక్త పద గ్రస్తాలంకారచ్ఛాయల్ని మూటగట్టి, మూమాయనట్లు చేస్తున్న దనికూడ చెప్పవచ్చును. 2. ఉపమానోపమేయక్రమాన్ని సుల

భంగా తెల్పుటకు, పద్యంలో 1, 2, 3....సంఖ్యలు వాడబడినవవి మనవి.

కాటయవేమన-1 మానవత్వంలో, 2 దానంలో, 3 అభిమానంలో, 4 బలంలో, 5 మాన్యధర్మంలో, 6 సంపదలో, 7 మనోహరరూపంలో, 8 ఐశ్వర్యంలో, 9 ధన విషయంలోకూడ వరుసగా, 1 అర్జునుని2 అర్జున విరోధియైన కర్ణుని, 3 కర్ణుని ప్రభువైన దుర్యోధనుని, 4 ఆ దుర్యోధన శత్రువైన భీముని, 5 ఆ భీముని అన్నయైన ధర్మరాజును 6 ధర్మజుని బావమరిదియైన కృష్ణుని 7 ఆ కృష్ణకుమారుడైన మన్మథుని 8 ఆ మన్మథ శత్రువయిన ఈశ్వరుని. 9 ఆ శివుని స్నేహితుడైన కుబేరునితోను పోలి యున్నాడు సుమా!

వి. 1 ఈ పద్యరచయితపేరు తెలియలేదు. 2 కాని, ఈ పద్యా న్ననుకరించి, అల్లసాని పెద్దన, తన 'మనుచరిత్రలో రాయల తండ్రియైన నరసింహరాయలను, "శ్రీరుచిరత్వభూతి...."(మ. 1-20) అనుపద్యంలో స్తుతించి, తన పెద్దతనాన్ని నిల్పుకొనప్రయత్నించినట్లున్నది.

## 108. ధీరత సారభోగముల ధీనిధి ఈశ్వరనారసింహుడు

ఉ. శ్రీరుచిరత్వ, భూతి, మతి, జిత్వర, తాకృతి; శక్తి, కాంతులన్,
ధీరత, సార, భోగముల, ధీనిధి, యీశ్వర నారసింహు, డా
వారిజనాభ, శంకరుల, వారి కుమారుల, వారి తమ్ములన్,
వారి యనుంగు మామలను, వారి విరోధుల, బోలు నిమ్మహిన్ (మ.చ 1-20)

నం. ఒక కవి కాటయవేమునిపై చెప్పిన "మానుష దానమాన....

అను చాటు పద్యాన్ని అనుకరిస్తూ, పెద్దన కృష్ణరాయల తండ్రి నరసింహ రాజును" ఈ పద్యంలో ద్వంద్వసమాసంలో క్రమాలంకారాన్ని నందించి, వర్ణించాడు.

ధీనిధి-ఈశ్వర—నారసింహుండు=బుద్ధికి నిలయుడైన—ఈశ్వరరాజ పుత్రుడైన-నరసింహరాజు, 1 శ్రీరుచికత్వ, 2 భూతి, 3 మతి, 4 జిత్వ రతా, 5 ఆకృతి, 6 శక్తి, 7 కాంతులన్, 8 ధీరత, 9 సార, 10 భోగ ములన్- 1 లక్ష్మితో ప్రకాశించుటచేతను, 2 అణిమా, మహిమా....మొ. అష్టైశ్వర్యములచేతను, 3 బుద్ధిసామర్థ్యంతోడను, 4 జయించుస్వభావం చేతను- 5 ఆకారంతో, 6 సామర్థ్యంతోడను, 7 ప్రకాశంతోను, 8 ధైర్యంతోను, 9 స్థిరాంశమగు బలంతోను, 10 భోగభాగ్యాలతోను, యధాక్రమంగా, 1 ఆవారిజనాభ= ఆ విష్ణువును, 3 శంకరుఁన్=శివుని, 3,4 వారి కుమారులన్=ఆహరి-హరుల పుత్రులగు, 3 బ్రహ్మదేవుని, 4 కుమారస్వామిని, 5, 6 వారి తమ్ములన్=ఆ బ్రహ్మకు, కుమార స్వామికి, తమ్ములగు, 5 మన్మధుని. 6 వీరభద్రుని, 7, 8, వారి అనుంగు మామలను=ఆ మన్మథ, వీరభద్రులకు ప్రియులైన-మేనమామ లగు 7 చంద్రుని, 8 మైనాకుడనువానిని, 9, 10. వారి-విరోధులన్=ఆ చంద్ర, మైనాకులకు-శత్రువులగు 9 రాహువును, 10. ఇంద్రుని, ఈ+ మహిన్=ఈ లోకంలో. పోలున్=ఉపమించిచెప్పుటకు వీలగును.

అనగా, నరసింహరాజా లక్ష్మిని గల్గియుండుటతో 1 హరిని, అణి మాది ఐశ్వర్యములతో 2 శివుని, బుద్ధిబలంతో 3 బ్రహ్మను, జయ శీలంతో 4 కుమారస్వామిని, రూపంతో 5 మన్మథుని, సామర్థ్యంతో 6 వీరభద్రుని, ప్రకాశంతో 7 చంద్రుని, ధైర్యంతో 8 మైనాకుని, బలంలో 9 రాహువును, భోగాలతో 10 ఇంద్రుని యధాక్రమంగా పోలి యున్నాడని భావము,

వి. 1- శ్రీరుచిరత్వమాతిమతి...., సారభోగముల....ఇత్యాది ద్వంద్వసమాసములలో యథాసంఖ్యాలంకారాన్ని కవి చిత్రించినాడు.

2. ఇన్ని ఉపమానాలు మాలగా కూర్చటంవలన 'మాలోపమా, అలంకారముకూడ కలదు.

3. ఇంత రసరమ్యంగా చిత్రించిన 'పెద్దన' మనకు 'పెద్ద-అన్న' గా, గౌరవనీయుడు కాకుండ ఎట్లుండగలడు ?

## 109. నీ శూద్ర ప్రజ్ఞలు విప్రసత్కవి వచస్స్ఫూర్తి న్విడంబించునే?

అద్రిస్నిగ్ధతలంబు, బుద్బుదము, లుద్యద్దారు భూషావళుల్,
క్షుద్రౌదుంబర పాక పక్వఫలముల్, శుక్త్యంతరాకాశముల్,
రుద్రాక్షాక్షర పంక్తి విభ్రమము, లీయాథి న్నిరూపింప, నీ
శూద్రప్రజ్ఞలువిప్రసత్కవి వచస్స్ఫూర్తిన్ విడంబించునే?

సం. కృష్ణదేవరాయలు పోషించిన అష్టదిగ్గజములలో, రామకృష్ణ భట్టుమూర్తి కవులిద్దరికి షష్టాష్టకము (విరోధము) తె.రా. కృష్ణకవి భట్టు కవి అంటేనే భగ్గునమండుట. "శూద్రుడని కాపుకవి" అని, కులం పేరు చెప్పి దూషించిన, అనేక పద్యాలను, చా.ప.మంజరి, చా.రత్నాకరములలో ఎన్నో కలవు కావలసినవారక్కడ, వానిని గాంచగలరు. వాస్తవానికి, శూద్రులనబడిన కవులుకూడ, కమనీయ, నమనీయ, పావన పద్యాలెన్నో వ్రాసి, ప్రసిద్ధిగాంచిన వారెందరో లేకపోలేదు.....

ఓయీ నీచ శూద్రకవీ! కవిత్వం విషయంలో (తెలివితో నీవుచెప్పే) ప్రజ్ఞావాదములు, తెలివి, యుక్తిగలిగి యున్నను, శాస్త్రాధారములులేని-భాషణములు. 1. పర్వతమునందువలె కఠిన ప్రదేశములు, సరళములు కావు సుమా! 2 నీటిబుడగలవలె తాత్కాలికాలు, కలకాలముండునవి కావు. 3 కొయ్యచెక్కతో చేసిన అలంకారాలు, పిల్లల బొమ్మలవలె తేలికైనవి.

4 మేడిపళ్ళవలె పైకి మేలిమిగా కన్పడి, లోన పురుగులవలె,అర్థ గాంభీర్యము గలవికావు. 5 లోపల ముత్యాలులేవి, ఖాళీ ముత్తెపు చిప్పలవంటివి 6 రుద్రాక్షలపైనున్న కణుపులు, గీతలు పైకి అక్షరాలవలె భ్రమ కల్గించినా అవి అసలు అక్షరాలేకావు. 7 ఈ విధంగా పైన పటారం లోపలొటారంగా నున్న, నీ డాబు కవిత్వ సంభాషణలు, బ్రాహ్మణ సత్కవీంద్రుల వాగ్వైఖరుల వన్నెను, వాసిని అనుకరించినా, మోసగింపగలవా?

వి. 1. ఎన్నిసార్లు జన్మలెత్తి, పైకి ఏపు సంపాదించినా శూద్ర కవుల ప్రజ్ఞావాదములు, బ్రాహ్మణకవుల వాగ్విన్యాస వైభవ విదర్శనమును పొందజాలవని భావము.

2. ఇట్టి సంకుచిత కుల, మత భావాలు కమనీయ కవితలలోగూడ ప్రతిఫలించి, ప్రజలను ప్రొలుమాలిన వారిని చేయటం చింత్యము.

## 110. 'కన్నా నాలంజెకొడుకులు కవులు గాగ....'

సీ. 1 దూదేకుల హుసేను, 2 బొమ్మరిగోపాలు
3 వ డ్రమంగడు, 4 గాండ్ల బాలిగాడు,
5 బయసేను నాగడు 6 పటు సాలె నారాయ
డ 7గముడి లచ్చిగా, డా 8ముకుందు
9చాకలి మల్లడు, 10సాతాని తిరుమల, 11గొల్ల
కాటడు, 12 బెస్త గురివిగాడు,
13 కోమటి శంభుడు, 14 కుమ్మరి చెంగడు
15మంగలెల్లడు, 16బోయ సింగడొకడు
గీ. కన్ననా లంజె కొడుకులు కవులు గాగ,
వేద శాస్త్రంబు లేడను? విప్రు లేడ?
మదరిపు విఘాల— (తె.తి.క. 120 పేజి)

సం. సెక్యులర్ స్టేట్ (గణతంత్ర రాజ్యము)గా, శాసనాలుచేసి, డాబులు చెప్పుకొంటున్న నేటి కాలంలోనే, కులాల కుమ్ములాటలు తప్పటం లేదు. పూర్వకాలంలో ఇంకా ఎక్కువగా ఉండేవి. నేటివలె, తక్కువ కులాలవారు అగ్రవర్ణాలవారికి, అణగిమణగి ఉండేవారేకాని, నేటివలె ధిక్క రించేవారుకాదు. కవిత్వం మొదలగు కళలకు, వేదశాస్త్రాధ్యయన, అధ్యాప నాదులకు, బ్రాహ్మణులే గుత్తగొన్న కాణయాచులుగా గణింపబడేవారు. నేడట్లు కాక, నీచశూద్రజాతులవారు, అనులోమ—విలోమ-అధమ జాతుల వారుకూడ కవులై, కవిత్వం వెలయింపటంతో, కనిపట్టలేక, ఆనాడు, నీచజాతులుగా పరిగణింప బడినవారిని, లంజకొడుకులు (వేశ్యాపుత్రులు, రంకుకాండ్రు, విటులు..)గా తెల్పుచు, అగ్రజాతి కవులు కొందరు దేవు నితో ఇట్లు మొరపెట్టుకొనుచున్నారు. ఆ కవి శబ్ద వాచ్యులెవరనగా,—
1. దూదినేకి పరుపులుకుట్టే హుసేనుసాహెబు, 2 దొమ్మరి (గడకట్టి, ఆడి, జీవించు ఒక జాతి) గోపాలుడు, 3 మ్రదంగం చేయుమంగడు, 4. గాండ్ల (గానుగాడి, నూనెతీసి, అమ్ముకొను తెలికల) బాలిగాడు, 5 బయసేను (ఒకనీచజాతి?) నాగడు, 6. పట్టుబట్టలు నేయు సాలి నారా యడు, 7. అగమడి(?) లచ్చిగాడు=అగచాట్ల మూట లచ్చిగాడు 7. మదిం చిన (ఆ ము?) కుందుదనువాడు, 9. చాకలి మల్లడు, 10. చాత్తాదవైష్ణవుడు తిరుమల 11. కాట దమగొల్లవాడు, 12. పల్లకీయోయు, లేక చేపలు పట్టే గురువిగాడు,13. కోమటి శంభుడు,14. కుండలుచేయు(కుమ్మరి) చెంగడు, 15. క్షౌరము చేయు మంగలి ఎల్లడు, 16. వేటాడు-కిరాతుడు సింగడు.... ఇంకా ఇట్లు ఎదుట కన్పడే నీచకులాలకు చెందిన, తాడిత, పీడిత, దళిత జాతులకు చెందిన హీనులెందరో లంజకొడుకులు, నేడు 'కవులు'గా చెలా మణీ అవుతూ ఉంటే, ఇక, ఓదేవా! వేదాలగతి, శాస్త్రాలగతి, ఆ బ్రాహ్మ ణులగతి ఏమి కావాలి? ఇక వారి స్థానమెక్కడ? దయచూపవా? ప్రభూ! అని ఆనాటి బ్రాహ్మణులీవిధంగా ప్రార్థించినారు.

వి. 1. ఆనాడు తక్కువ కులాలవారిని, ఏకవచన ప్రయోగంతో, పేరుతో 'గాడు'ను కూడ చేర్చి, పిల్చెడి వారని గమనింపవలెను.

2, నేడు చదువు సంధ్యలు, ఓటు హక్కు, హెచ్చుతగ్గుల విచ్చిన మెట్ల సమాజం పనికిరాదు, అందరు సమానులే, అనుసామ్యవాద, మానవతావాద భావాలు పెరిగి, అస్పృశ్యత పనికిరాదని, కులాంతర వివాహాది సంబంధాలు, ధన సంపాదన, ఉద్యోగాలు, రిజర్వేషన్లు, మొ.నవి, తక్కువ కులం వారని, కులం పేరు పెట్టి నిందింపరాదను శాసనాలు, శిక్షలు, అసమ్మతి ప్రదర్శనాలు....మొదలగునవి పెరగటంతో, ఇట్టి కేసులు, వ్యవహారాలు, నానాటికి తగ్గుతూ వస్తున్నాయి.

3. ఆనాడు, ఇట్టి విభేదాలు, కలహాలు కేవలం విప్రజాతుల విషయంలోనే కాక, ఇంకా పై వర్ణాలలోను, కార్మిక కర్షకులలోను, 'మేము హెచ్చు, మీరు తక్కువ, మా యిళ్ళలో, కుక్కలు, పిల్లులు, గొడ్లు గోద మొదలగు నీచ జంతువులైనా తిరుగవచ్చు, తాకవచ్చు, గాని, తమవలె మానవజాతికి చెందిన, మాల, మాదిగ....మొదలగు వారితో, పనులయితే బాగా చేయించుకొని, వారంటిన వస్తువులపై నీరు రంగరించి, చల్లి, శుద్ధియైనట్లు భ్రాంతిపడియో, పదకయో, భావించెడివారు. గాంధిమహాత్ముని హరిజనోద్యమం, రాజకీయ, నాటక, సినిమా, రేడియో, టి వి.....ఆ టి ప్రదర్శనలు, వానిలోని దొసగులను కళ్ళకు కట్టినట్లు చూపటంతో క్రమంగా తగ్గుచున్నాయి. నేటి కాలం వారికిపాత సంఘటనలు తెలియజెప్పుటకై వ్రాయవలసి వచ్చినదని మనవి. ఇట్టి అగ్రకులాలవారి, ఆనాటి ఆరట, ఆర్భాటాలను గూడ కొద్దిగా గమనించండి.

## 111. ఆసనాధరగళ మూర్తు లతివ కజుడు....

గీ. 1 ఆసనా 2 ధర 3 గళ 4 మూర్తు లతివ కజుడు
1 చంద్ర 2 కురువింద 3 శంఖ 4 చంచలల జేసి,

చెలగి, 1 తచ్చిహ్న 2 కాఠిన్య 3 సిత 4 చలతలు
సారిది 1 కచ 2 కుచ 3 హాస 4 దృష్టులుగ జేసె॥ చా.మం॥

సం. ఈ పద్యం తెనాలి రామకృష్ణువిదిగా ప్రసిద్ధము.

బ్రహ్మదేవుడు వనితయొక్క ముఖము (ఆననము)ను చంద్రుని తోను, పెదవిని (అధరమును) పద్మరాగ (కురువింద) మణితోను. కంఠ (గళ)మును శంఖములోను, ఆకారమును (మూర్తిని) మెరుపు (చంచల) తోను, క్రమంగా, ఉపమింప, సృష్టించినాడు. కాని, ఆ ఉపమానాలలో, క్రమంగా నున్న, కొన్ని దోషాలను, తర్వాత, గమనించి, మరల విజృంభించి (చెలగి) ఆ చంద్ర-చిహ్నమైన నల్లని మచ్చను ఆమె వెంట్రుకల (కచాల)తోను, పద్మరాగమణిలోని కఠినత్వమును స్తనాలలోను: శంఖం లోని తెల్లదనాన్ని (సిత) ఆమె నవ్వు (హాసం)లోను, మెరుపు (చంచల) లోని చపలత్వాన్ని ఆమె చూపులలోను, క్రమంగా, రూపొందించి, ఆ అపవాదు నుండి తప్పుకొన్నాడట!

వి. పద్యంలోని 1,2,3,....అంకెలను బట్టి 'క్రమాలంకార' వైచిత్ర్య మున్నది.

**112.** మున్నూరు తలలవాడు మిమ్ము ధన్యుజేయు.

పదియు, నైదు, నైదు, పదునైదు, పదునైదు,
ఇరువదైదు, నూట యిరువదైదు,
ఎలమి మూడు నూరు, లిన్నూరు, మున్నూరు,
తలలవాడు మిమ్ము ధన్యుజేయు.

వి. పద్యంలోని అంకెల నన్నీ క్రమంగాకూడిన, జవాబువిచిత్రంగా వస్తుంది.

1వ పాదం: 10+5+5+15+15(=50), +, 2వ పాదం: 25+125, (= 150), + 3వ పాదం: 300+200+300 (=800)

(= 50+150+800)=1000 (వేయి) తలల ఆదిశేషుడు మిమ్ములను కృతార్థులఁజేయుగాక!

**113.** ఒక్కముద్ద దిగమ్రింగుము, నీపసగాన వచ్చెడున్!

ఫుల్లసరోజనేత్ర! అల పూతన చన్నులచేదుద్రావినా,
నల్ల దవాగ్ని మ్రింగితి నటంచును నిక్కెదవేల? తింత్రిణీ
పల్లవయుక్తమౌ నుడుకు పచ్చడి, శాకము జొన్నకూటిలో
మెల్లన నొక్కముద్ద దిగమ్రింగుము, నీపసగాన వచ్చెడున్,

సం. ఒకనాడు 'రేనాడు' వెళ్ళిన శ్రీనాథుడు శ్రీ కృష్ణునిట్లు ప్రశ్నించెనట!

ఓ కమలాక్ష! కృష్ణా! 1. అలనాడు, చిన్నతనంలో, విషం వలె మన్న, 'పూతన' అనురాక్షసి యొక్క, చేదైన చనుబాలను త్రాగాను-అవీ, 2. గోపకుల మీద వచ్చిపడుచున్న 'దావాగ్ని'ని కూడ, నేను గనుకనే, మ్రింగివేశాననీ, అవేవో చాల గొప్పపనులు, ఇతరులకు అసాధ్యములైన వానిని చేశానని గర్వపడుచున్నావు. ఓ సోసి! అదీ ఒక గొప్పవనేనా? ఒక్కసారి, ఈరేనాటివారు, చింతచిగురుతో పక్వమైనవేడిపచ్చడితో కలుపుకొన్న, ఒక్క జొన్నకూటి ముద్దను తిని చూస్తే, అప్పుడు ఆ కష్ట మేదో- ఎట్టిదో, అసలు సంగతి ఏదో నీకు తెలుస్తుంది. నేపన, నీ సరుకు అప్పుడుగాని బైటపడదు సుమా!

ని. పూతన చేదుపాలకంటే, దావాగ్ని వేడికంటె, రేనాటి చింత చిగురు పచ్చడి కలుపుకొన్నజొన్నకూటి పచ్చడితో తినటం మిక్కిలి కష్ట మని భావన.

**114.** 'సద్యో మదమొదవి పూర్వ సరసత లుడుగున్'

క. ఉద్యోగ మొదవినప్పుడు
సద్యోమద మొదవి పూర్వ సరసత లుడుగున్

విద్యావంతులకైనను
విద్యావిహీనులకు వేరె వివరం బేలా?

ఎంతో కష్టపడి, ఎన్నోవిద్యలు చదివి, ఎంతో ప్రయత్నించగా, ఏదో పదవి, ఉద్యోగ్యం దొరకటంతోనే, విద్యావంతులైనవారిలోకూడ, పూర్వమున్న సరసత, మంచితనం మటుమాయమైపోయి, వెంటనే, ఏదో ఏంతో, గర్వం (సద్యః+మదం) కలుగుతూ ఉంటే, ఇక విద్యావిహీను లగు వింత పశువులగు పామరుల పంగతి చెప్పవలెనా? అని అర్థా పత్త్య లంకారంతో ఎదురు ప్రశ్న.

**115.** ము త్తె రంగులు మహింగల యట్టి విమర్శకుల్.

ఉ. ఉన్నది ఉన్నదంచనుచు నుఃడెడి వా
దధముండు, తెల్వి మై
ఉన్నది లేదటంచనుచు నుండెడి నాతడు
మధ్యముండు, లే
కున్నది యున్నదంచనుచు నుండు నతండిల
నుత్తముండ యా,
నెన్నగ ము త్తెరంగులు మహింగల యట్టి
విమర్శకుల్ వెనన్.

సం. నేటి విమర్శకులు ముచ్చటగా మూడు విధాలుగా నున్నారని, శ్రీ అనంత పంతుల రామలింగస్వామి, హాస్యప్రాయంగా నిట్లు పేర్కొనెను.

1. ఆయా గ్రంథాలలో ఉన్న మంచిని విమర్శించువాడు అధమ విమర్శకుడు, 2 అధిక తెలివిని ప్రదర్శిస్తూ, ఆ గ్రంథాలలోఉన్న మంచిని లేదంటూ పేర్కొనువాడు మధ్యముడు, 3. ఇక, ఆ పుస్తకాలలో చెప్ప

బడని, లేవి, మంచిని, విషయాన్ని, ఉన్నదని ఉగ్గడించేవాడు ఉత్తమ విమర్శకుడుగా ప్రపంచంలో చెలామణి అగుచున్నారని. ఆ. రా. స్వామి గారి వేళాకోళపు విమర్శ.

**116.** కలుగక ఇచ్చేది దాతలు తలవెంట్రుకలంతమంది

క. కలుగక ఇచ్చేదు దాతలు
తల వెంట్రుక లంతమంది తర్కింపంగా,
కలిగియు ఈయని లోభులు
కలరు బొమల వెంట్రుకలకు కడు తక్కువగా॥

(చా. మం)

("మొలవెంట్రుకంతమంది మోహనరంగా!" అని చా. ర. పాఠాంతరం.)

జాగ్రత్తగా పరిశీలించి, ఊహించి చూస్తే, లోకంలో దాతలెందరో కన్పడతారు. అయితే, ఏమి ప్రయోజనం? వారి వద్ద దాతృబుద్ధి ఉన్నది గాని, ధనం మాత్రం లేదు. ఇట్టివారు తలలో మొలచిన వెంట్రుకలవలె వేలకొలది వేలయున్నారు. ఇక, ఎంతగానో, ఆస్తితో, పదవితో, పలుకుబడితో ధనసమృద్ధి కలిగియున్నను, దానబుద్ధి లేక, ధనాన్ని ధర్మసంస్థలకు, కవి పండితులకు పంచి ఇవ్వజాలని పిసినిగొట్టు పెద్దలు, చిన్న కనుబొమ్మలపైనున్న వెంట్రుకలవలె చాల తక్కువగా నున్నారు సుమా! అని హెచ్చరిక.

వి. 4వ పాదానికి అసలు పాఠం 'మొల వెంట్రుకలంత మంది మోహనరంగా !' అని. ఆ కవి కచ్చితో, కఠినంగా, అలోభులను నిందింపగా, సభ్యతను పాటించిన తరువాతి వారు 'పాఠాంతరా'న్ని కల్పించి వ్రాశారని కొందరు.

వి. ధనవంతులు తమ సంపాదనలో కొంత భాగమైనా, ధర్మసంస్థ

లకు, కవి పండితులకు ధర్మంచేసి, ఈ లోకంలో స్థిరకీర్తి ప్రతిష్ఠలను పొందవలెనని తాత్పర్యం.

## 117. చాటుకవిని గాను 'చాటుకవిని!'.

ఆ. జీవితానుభవము జేర్చి కైతలు వ్రాసి,
చదువరులకు నిజము చాటు కవిని,
తాను గొనిన చవు లితరులకు బంచని
చాటుకవిని గాను, 'చాటుకవి'ని ॥

N. B. ఈ పద్యం శ్రీ పి.బి. శ్రీనివాస్‌గారిది. వీరు సరస్వతీ కర ద్వయమగు సంగీత, సాహిత్యోపాసనచేసి, అనేక భాషల్లోని చలన చిత్రాలెన్నింటికో, నేర్పుతో, నేపథ్యగానం చేసిన జగత్ప్రసిద్ధులు. అయితే, వీరు ఆంధ్ర, ఆంగ్ల, తమిళాది భాషల్లో కూడ అనితరసాధ్య రచనలు చేసిన, చేయుచున్న సంగతి మాత్రం సర్వులకు తెలియదు. కవిత్వాన్ని గూర్చి, వారి వివరణను వినండి.

మహాశయులారా! లోక శాస్త్రాద్యవేక్షణ వలన, జీవితంలో ఎదురొ్కన్న అనుభవాల నన్నిటిని గుదిగుచ్చి, కవితల్లో గూర్చి, పాఠకులకు సత్యాన్నిచాటి చెప్పాలనుకొనే, చాటు కవిని నేను. అంతేకాని,తాను సంపాదించిన, కావ్య సౌందర్య, సౌరభాలను, ఇతరులకు పంచి చూపితే, కొంప మునుగుతుంద నుకొనే, అల్పబుద్ధిగల 'చాటు కవి' (ఇతరులకు కన్పడ నీయకుండ, చాటుగా, రహస్యంగా, వ్రాసి, చేటు తెచ్చే కవి)ని మాత్రం కాను సుమా! అయితే, మరెవరు? కవితా సౌశబ్ద్య రహస్యాలను'దండోరా' వేసి, అందరికి బహిరంగంగా, చాటి చెప్పే 'చాటు (పద్య)కవి'ని సుమా! అని హెచ్చరిస్తున్నారు.

శ్రీ పి.బి.యస్. నవ్య కవితా ప్రియులైనా, చిత్ర కవిత్వ రచనా దక్షులు. వారి, ఆయా ముక్తక పద్య పాదాల యొక్క, ఆది - మధ్య - అంత్య—అక్షరాలను కలిపిన, అనేక నామాలు, సూక్తులు, నీతులు కూడ వస్తాయి. అట్టి చిత్రరచనలో స్థిరప్రజ్ఞులు వీరు. అంతేగాక, గోష్ఠులలో, సభలలో చాటువులను, ఛలోక్తులను విసిరి, శ్రోతల హృదయాల నిట్టే ఆకట్టుకొనగల ఆరిందా. ఆశుకవితలనుగూడ అనర్గళంగా అందించగలరు. వీరి 'ముక్తక' పద్యాలెన్నో పత్రికలలో ప్రకటింపబడ్డాయి కూడ.

## 118. మగముండకు మీసమేల? మరి మూతిపయిన్!

క. వగ మాన్పి అర్థికియ్యని
మగముండకు మీసమేల? మరి మూతిపయిన్,
తెగ గొరుగడాయె మంగలి
రగడందున కీర్తి దోచ, రాయని బాచా!

రాయని భాస్కరా! యాచకుల దుఃఖములను, బాధ (వగ)లను, పోగొట్టని, అర్థులకు దానంచేయని, మగపుట్టుక పుట్టిన (వెధవ) ముండకు మూతిమీద మీసం కూడ ఎందుకో? (మీసం పౌరుషచిహ్నం కదా) దానిని మంగలివాడు, ఇంకా ఎందుకు గొరగకుండా వదలిపెట్టాడు? అలా గొరిగి, మగవానిని 'ముండ' (బోడితలవాడు)ను చేస్తే, మంగలికి మంచిపేరు ప్రతిష్ఠలు గూడ వచ్చేవి కదా!

## 119. పూర్వోత్తర కవితలు.

N. B. : పూర్వోత్తర కవితలను గూర్చి, సర్వశ్రీ వేటూరివారు, బ్రౌన్ మహాశయుడు భిన్నాభిప్రాయాలను వెలిబుచ్చినారు. కవిత్వం రాకున్నను, చాతుర్యం గలవారు కొందరు, పూర్వకవుల పద్యాల తలలు

మార్చి, మల్కిభ రామాదుల ద్వారా మాన్యులైనట్లు కొన్ని వాదము లున్నవి. —

— అట్లుకాక, మల్కిభరాముడే, 'పూర్వ-ఉత్తర కవిత్వా'లకు పరీక్ష పెట్టినట్లు, మరొకవాదం విన్పడుతోంది.

మల్కిభ రాముడు దర్వాజా ముందు వెండి, బంగారు రొట్టెలను కట్టించి, పూర్వకవిత్వం చెప్పువారు 'వెండిరొట్టె'ను, ఉత్తర కవిత్వం చెప్పాలనుకొనేవారు 'బంగారు రొట్టె'ను గ్రహించి, పరీక్ష నీయవలసి యుండునని, నిబంధించెనట! అప్పుడొక కవి, రెండు రొట్టెలను గ్రహించి, పరీక్ష నిచ్చెనట!

(1) పూర్వకవుల పద్యాలలోని మొదటి మూడు పాదాలను గ్రహించి, నాల్గవచరణాన్ని సందర్భోచితంగా, చాతుర్యంతో తాను కలిపి, 'పూర్వ కవిత్వం'గా నిట్లు పూరించెనట! ఉదా :

క. "కరయుగములు చరణంబులు
ఉరము, లలాట స్థలంబు, నున్నత భుజముల్
సరి ధరణి మోపి మ్రొక్కిరి
మరిమరి నీ శత్రులెల్ల మల్కిభ రామా!"

వి. దీనిలో మొదటి మూడు పాదాలు పూర్వులవి కాగా, నాలుగవది సొంత పూరణ.

ఇక, 'ఉత్తర కవిత్వ' మనగా 'సమస్య' వంటిది. నాల్గవ చరణంతో ప్రశ్నిస్తే, ముందున్న మూడు పాదాలను అర్థానుగుణంగా సమకూర్చుట. ఉదా :

అక్కరో! నీదు వల్లభు డహంకృతి కేసిన
చేత వింటివా?
ఎక్కడ? ఎక్కడే? మరియు నెవ్వరి నెవ్వరి?
నన్నె! నన్నె! నీ

వక్కడికేల పోవలయు? పంపవ? పంపితి,
కూడుమంటినా ?
"మ్రొక్కితి, వేడుకొంటి, నను ముట్టకుమంటి,
నికేమి చేసెదన్ ?

వి. వేటూరివారు ఈ పద్యాన్ని "శృంగార చాటువు"ల్లో చేర్చి చూపారు.

## 120. కాకమానురాయ నీకె తగుర!

ఆ. అల్లసానివాని అల్లిక జిగిబిగి
ముక్కుతిమ్మనార్య ముద్దుపలుకు,
పాండురంగవిభుని పదగుంభనంబును
కాకమానురాయ నీక తగుర!॥

సం. ఒకనాడు రామరాజభూషణుని పదగుంభనానికి మెచ్చిన రాయలు, వెంటనే, తన మెడలోని తారహారంతీసి, మూర్తికవి మెడలో వేసి గౌరవించెను, ఇంకేముంది? కొంపమునిగినట్లు, ఆస్థానకవి పండితు లందరు, కట్టగట్టుకొని. రామకృష్ణుని ఇంటికేగి, ఈ అవమానానికి తగిన ప్రతీకారముచేయుటకు నీవే తగుదువనిరెచ్చగొట్టినారు. రామకృష్ణ&మూర్తి కవులకు అసలే షష్టాష్టకం (విరోధం)గదా! కనుక వెంటనే,రామకృష్ణుడు భట్టుమూర్తి ఇంటికేగి, అతని సమ్మానానికి సంతసించినట్లుగా, ఈ పద్యం చదువ, అమితానందభరితుడైన రామరాజభూషణుడు, తన మెడలోని హారాన్ని అతని మెడలోవేసి, కృతజ్ఞతను తెల్పుకొనెనట, మరునాటి సభలో, రామకృష్ణుని మెడలోని హారాన్ని చూచి, అతని పద్యాన్ని విని, వారిద్దరికి సఖ్యమేర్పడినందుకు రాయలెంతో సంతసించెనట.

కాని, మాత్సర్యగ్రస్తుడగు రామకృష్ణుడు మాత్రం ఆ పద్యం స్తుతి

పరమైనది కాదని, నిందాపూర్వకమైనదని, దాని అర్థాన్ని విరుద్ధంగా విట్లు విడదీసి చూపెను.

భట్టుమూర్తికవీ! పెద్దన రచనలోని తళుకుబెళుకులు, నందితిమ్మన ముద్దులపలుకు, పాండురంగప్రభుని పదలాలిత్యం, ఇవన్నీ వారికే తగియున్నవిసుమా! కాక=అట్లుకాక, అవన్నీ నీచుడవగు నీకెలావస్తాయి? ఇక నీక (=నీకు+అ) నీకైతే, మాను–రాయ=దురదపోవుటకు చెట్టు (మాను)కు-రుద్దుకోవడమే, తగుర=తగియున్నది సుమా! అని, 'కాక మాను' శబ్దాన్ని శ్లేషతో విడదీసి, విపరీతార్థం చెప్పటంతో, సభంతా ఒక మారుగా సంభ్రాన్తమైపోయిందట!

ఇంకా, విడువక, కావాలంటే మూర్తికవి చొక్కా ఊడదీయించి, వీపుపైనున్న తామరను చూపించి, ఆ తామర దురదను రుద్దుకొనుటకే, అతడు ఆ మాను దగ్గర కూర్చుంటాడని, అది అతనికే తగునని, అక్కనున వెక్కిరిగక్కెనట !

## 121. త్రోవ తొరికినవట్టి గందోళిగాడు !

సీ. గొంగడిపురుగు కట్టింగు మీసలవాడు
గంపశ్రాద్ధపు తలకట్టువాడు
ఎపుడు కాఫీ దుకాణపుసేవిణీవాడు
సిగరుపీలుపు బుగబుగలవాడు,
పైపటారమును లోపలలొటారము వాడు,
పట్టుతప్పిన చలోభాయిగాడు,
తుదమొదల్ లేని గాడిద గత్తరవాడు
జలసాలతో పడి చచ్చువాడు,

తే. తడిఆనెడి దున్నచో చేతతుడుము మొదలు
దేవతార్చన వరకొక్క- తీరువాడు
వలను కడకున్న శ్రీశుకు వంటివాడు
త్రోవదొరికిన వట్టి గందోళిగాడు!

నం. శ్రీ మాధవపెద్ది బుచ్చిసుందరరామశాస్త్రి, ఆ కాలంలో ప్రతి సాహిత్య సభలో ప్రత్యక్షమై, వేదిక నెక్కి-, పొదుంవట్టి కంచుకంఠంలో, జనరంజక ఫక్కీలో, హాస్యచాటువులు పాడి, అన్నివేలజనం, కిమ్మన కుండా, ప్రతి పద్యానికీ, పాదపాదానికి, కరతాళధ్వనులతో ర క్తికట్టించే వారట! తి. వేం. కవుల శిష్యులగుపీరు, గురజాడవారి హీరో గిరీశం, తెనాలి, బ్రహ్మ మొ. వారిపై చెప్పిన పద్యాలు ప్రశంసార్హాలు, అవన్నీ ఆనాటి ప్రజల నాల్కలపై నాట్యమాడేవి.

గిరీశం ఎట్టివాడంటే, ముక్కు- మొదట్లో గొంగళిపురుగువలె, ప్రెంచి కట్టింగు నల్లని మీసాలతో నుండెడివాడట. అతని పిలకట్టు గంపశ్రాద్ధం కొలువువంటిది, ఎల్లప్పుడూ కాఫీహోటల్లోనే తిష్ఠవేసి, సిగరెట్టు పొగవాన నలు బుగబుగ వ్యాపింపజేసేవాడు, పైనవటారం, లోన లొటారంగా, దాబుగా, దబాయిస్తూ, పట్టుబప్పితే, మళ్ళీ కన్పడకుండా మాయమయ్యే వాడు. మొదలు చివర, క్రమంలేని గాడిద కొలువు, జల్సాలంటే జారిపడి వచ్చేవాడు. బండతడి గుడ్డతో, ఒకదేఆన్నిపనులు చేసేవాడు (తుడుము.... వరకు-ఇది అన్నిపనులు ఒకదే చేయవలసివ స్తే విసుగునుతెల్పే దేశీయ పదం) వీలుపడితే, విశ్వనక ఉపయోగించుకోవడం, లేకపోతే, శుకబ్రహ్మ వారే. దారిదొరికితే మాత్రం తోలుబొమ్మలాటలోని గందోళి (హాస్య) గాడు సుమా! గిరీశం అట్టి విలక్షణవ్య క్తి (ఆనాటి కొన్నిదేశీయ నుడి కారాలు నేటివారికి క్రొ త్తగా కన్పడతాయి)

**122. కులాభిమాన మొక చిన్నము లేదటరా? ప్రజాపతీ!**

ఉ. నిష్ఠదరిద్ర జీవనము, నెత్తురు సైతము పీల్చునట్టి పా
పిష్ఠి ఋణాల బాధయును, పిల్లికి బిచ్చము పెట్టనట్టి కం
కోష్ఠపు గ్రామవాసమును కొల్లగ నొష్ఠలిఖించినావురా!
జెష్ఠ! కులాభిమాన మొక చిన్నము లేదటరా? ప్రజాపతీ!

ఓరీ! దరిద్రపు పెద్దమ్మా! (జెష్ఠ!) బ్రమ్మిగాడా! నీవు ప్రజలను, సంతానాన్ని పుట్టించి, పాలించు భర్తవు (ప్రజాపతివి) గదా! బాపన పుట్టుక పుట్టావు గదా! ఆ కులాభిమానం కొంచెం (చిన్నం)కూడ నీలో లేదేంటిరా? బ్రాహ్మణులకు ఎంత నిష్ఠ (చేటు, ఉనికి, నాశ-ఆధార-నిశ్చయ....ములు) దరిద్రపు బ్రతుకు సృష్టించావు? నెత్తురును కూడ పీల్చి పిప్పిచేసే, మిక్కిలి పాపంతో కూడిన అప్పుల సంబంధము (వరుస, దోషం....), ఏ మాత్రం అడుక్కొందామన్నా నికృష్ట కుగ్రామవాసం, కావలసినంత నొసట వ్రాశావు గదరా! సాటి బ్రాహ్మడని, కులాభిమానం కొంచెంకూడ లేదు గదరానీకు- అని బ్రహ్మను ఎత్తి పొడిచినాడు-శ్రీ మా.బు.శాస్త్రి.

**123. నానాటికి తీసికట్టు నాగంబొట్లూ!**

ఏనాటి అగ్రహార మొ-మానాటికి కంద్రికాయె, మీాపనితీరెన్
మానాడు మాన్యమయ్యెను-నానాటికి తీసికట్టు నాగంభట్లూ!

అయ్యా! నాగంభట్లుగారూ! మహారాజు లానాడు మన శ్రోత్రియ బ్రాహ్మణ్యానికి శిష్టులు వగైరాలేకుండా, దానం చేసిన అగ్రహారం (కొంచెం పెద్దగ్రామం) మీ వప్పు దప్పుళాల ఖర్చుతో తరిగినా, మీ పని పూర్తి అయింది. కాని, మా నాటికి మాత్రం కంద్రిక (=ఖంద్రిక, వైదికులకు దానం చేసిన చిన్నపొలం)గా మారిపోయింది. అదే ఇంకా కొంతకాలం గడిచేసరికి, అది మాన్యం (శ్రీమంతు లిచ్చు చిన్నపొలం)గా మారిపో తుంది! నానాటికి రానురాను తరిగిపోవటమేగాని, పెరిగేది లేదుసుమా! అని హెచ్చరిక.

వి. రోజు రోజుకు ఆస్తిపాస్తులు వగైరా తరిగిపోతూ ఉంటే, వేమన పద్యంవలె, తెలుగువారి సంభాషణలో సామెతగా ఇది విన్పిస్తుంది.

## 124. "కోడిం దిను డనుచు జెప్పె...."

క. కోడిని తినుటకు సెలవున్-వేడిరి మును బ్రాహ్మణులును వేధ, నతండున్,
కోడివల, దా బదులు ప-కోడిం దినుడనుచు జెప్పె, కూర్మి, పకోడీ,

పూర్వం కొందరు బ్రాహ్మణులు 'కోడిమాంసం తినా'లని, బ్రహ్మ (వేధ) అనుమతిని కోరినారట! అంత, ఆ బ్రహ్మ కోడిని తినవలదు దానికి బదులుగా (ఆ శబ్దసాదృశ్యంగల) 'పకోడీ'ని తిని తృప్తిపడండని, బ్రహ్మప్రేమతో పల్కెనట.

## 125 విశ్వమందు కలరు వివిధ విమర్శకుల్"

మసలు పూలయందు మలమూత్రములయందు
'ఈగ' వేరు, 'తేనటీగ' వేరు,
విశ్వమందు కలరు వివిధ విమర్శకుల్
వారివారి తీరు వేరు వేరు! (న.రా.)

పుష్పాల మీద, మలమూత్రాల (పెంట, ఉచ్చ) మీదనూ తిరిగేవి 'ఈగ'లే కావచ్చు. పూల మీద తిరిగి, మకరందం(తేనె)గ్రహించేవి 'తేనెటీగలు' కాగా, మలమూత్రాలపై తిరిగేవి మామూలు 'ఈగ'లు, అల్లే, ప్రపంచంలో మంచి, చెడును పరామర్శించే విమర్శకులున్నారు. అయితే, వారివారి పద్ధతులే వేరని గ్రహింపవలెను.

**126.** 'రంగు మార్చు రంగ నటుడు కాడు....'
పొదలనుండుగాని, పుష్పమ్ము కాబోదు,
కలదు తోక గాని, పాము కాదు,
రంగు మార్చుగాని, రంగనటుడు కాదు,
దీని భావమేమి? తిరుమలేశ! (సి.నా.రే.)

**127.** నమ్మునాతని జెరచు దానమ్మ సవతి....!
ఆలి నొల్లకయున్న వా నమ్మ మగని
అందు లోపలనున్న దానక్క మగని
నమ్మునాతని జెరుచు దానమ్మ సవతి
సిరులు మీ(మా)కిచ్చు నెప్పట్లు, కరుణతోడ॥

భార్యను గ్రహింపక ఉన్నవాడు "భీష్ముడు", ఆ భీష్ముని తల్లి గంగకు భర్తయైనవాడు 'సముద్రుడు', ఆసాగరం లోపల దాగినవాడు 'మైనాకుడు'. వాని అక్క 'పార్వతి', ఆమె భర్తయగు శివుని నమ్మి పూజించు 'రావణు'ని చెరచినది 'సీతాదేవి', ఆమె అమ్మ 'భూమి', ఆ భూదేవికి సవతి 'శ్రీదేవి' (లక్ష్మి). ఆ లక్ష్మి దయతో, ఎల్లవేళల, పూర్వం మాదిరిగానే, మనకందరకు సంపదలనిచ్చుగాక! (-అని కవి ఆకాంక్ష).

**128.** 'తండ్రి కొడుకు లొక్క తరుణిని రమియింప....'
తండ్రి కొడుకు లొక్క తరుణిని రమియింప,
పుత్రు లిద్ద రొందె, పోరు గలుగ,
ఒకని జంపి, రాజ్య మొకని కిచ్చిన ప్రభు
వాత డిచ్చు మాకు నఖిల సిరులు ॥

తండ్రి 'సూర్యుడు', అతనికొడుకు 'యముడు'. వీరిద్దరు వేర్వేరు సమయాలలో, యువతి యగు 'కుంతీదేవి'తో సంభోగించిరి. ఆ కుంతికి సూర్యుని వలన 'కర్ణుడు' యముని వలన 'ధర్మరాజు' అను పుత్రులు పుట్టగా, మహాభారత యుద్ధంలో, కర్ణుని చంపించి, ధర్మరాజుకు రాజ్యమిప్పించిన 'శ్రీకృష్ణ ప్రభువు' మాకు సర్వ సంపదల నిచ్చుగాక!

## 129. 'వృద్ధిక్షయములు లేని ధీవృద్ధుడెవడు?'

యౌవనంబున ముసలి యౌ నత డెవండు?
వరుస 'కర్ణత్రయము' గల్గువా డెవండు?
వృద్ధుడై యౌవనముగన్న సిద్ధుడెవడు?
వృద్ధి క్షయములులేని ధీవృద్ధు డెవడు?

N.B. 1 యువకుని 'ముసలి' అనటం విరుద్ధం .... ముసలము, (రోకలి)ఆయుధంగా గల-'బలరాముడు' 2 దుష్టచతుష్టయం(4)లో,దుశ్శాసన, శకుని, కర్ణులు ముగ్గురు. ఈ 'త్రయం'గలవాడు 'దుర్యోధనుడు'. 3 'చ్యవను'ని పుట్టా, పుట్టలు పెరిగి, కన్నులు 'మెరుపుల'వలె నుండ, 'శర్యాతి' సుత 'సుకన్య' ఆశ్చర్యపడి, పుట్టను త్రవ్వింప, వృద్ధ చ్యవనుడు కోపించి, శర్యాతి సైన్యమలమూత్రములు బంధింపబడునట్లు శపింప, శర్యాతి, 'సుకన్య'నిచ్చి పెండ్లిచేసి, శాపవిముక్తినొందెను. సుకన్య వానితో సుఖించెను. 4 ఈశ్వరునారాధించి, యమపాశమునుండి తప్పించుకొని, 'మార్కండేయుడు' చిరంజీవి యయ్యెను.

ఇది శ్రీ బి.సు. గారి రచన. వీరెన్నో సమయోచిత చాటు పద్యాలు వ్రాయటేగాక, సంకలనం కూడ చేసి, వినోదాన్ని అందించారు.

ప్ర 1. పడుచుదనంలో పడియుండియు 'ముసలి' (1)యైనవాడెవడు? ఉ. బలరాముడు, 2. ఒక క్రమంలో 'కర్ణత్రయం'(2)గల వాడెవడు? ఉ. దుర్యోధనుడు, 3. ముదుసలియైనను జవ్వనం పొందిన వాడెవడు? ఉ. చ్యవనుడు(3) 4. పెరుగు తరుగులు లేని బుద్ధి విశేషం గల వాడెవడు? ఉ. మార్కండేయుడు (4).

## 130. పారె ధర జొచ్చెను కృశించె.

గీ. కచ కుచా నన గళ నేత్ర కరయుగముల,
కళి కుభృ చ్చంద్ర దర వారిజ లత, లోడి,
పారె, ధరజొచ్చెను, కృశించె, వారి మునిగె,
పంకమున జిక్కె, నిడుదలై బయలు కురికె. చా, ర.

1 అళి, 2 కుభృత్ + 3 చంద్ర 4 దర 5 వారిజ 6 లతలు,— అనునవి, ఆ సుందరియొక్క, 1 కచ 2 కుచ 3 ఆనన 4 గళ 5 నేత్ర 6 కర యుగములకు అనగా - 1 వెండ్రుకలు 2 స్తనములు 3 మొగము 4 కంఠము 5 కన్నులు 6 చేతుల జంటలు, వీనితో సాదృశ్య మును పొందవలెనని ఎంతో ప్రయత్నించినను, గెలువలేక, ఓడిపోయి, క్రమంగా,అళులు-పారె=తుమ్మెదలు-మారంగా పారిపోయినవట,2 పర్వత ములు,ధరజొచ్చెను=భూమిలోకూరుకొనిపోయినవి-3చంద్రుడు,కృశించె= రోజు రోజుకు కళాహీనుడై। నశించెను. శంఖము, వారి జొచ్చెను = నీటిలో కన్పడకుండ మునిగిపోయెను. 5. పద్మము, పంకమున చిక్కె= బురదలో కూరుకొని, దాగినవట! 6. లతలు, విడుదలై—బయటికురికె= పొంపుగా పెరిగి, బైటికి పారజొచ్చినదట!

వి. సాధారణంగా, కవి సమయాలననుసరించి. సుందరీమణుల అవయవాలతోపోల్చబడు'అళి'.... మొ.నవి, పనికిరానందున,ఆమెయొక్క రమణీయావయవాలు 'లోకోత్తర సుందరము'లవి వ్యక్తమగుచున్నది.

## 'పేరడీల గారడీలు" కొన్ని.

పేరడీ (Parady)-ఇదొక ప్రత్యేక పాశ్చాత్య విమర్శన ప్రక్రియ. గంభీరార్థాలుగల, గద్యపద్యగేయాలను, వికటంగా అనుసరిస్తూ,విమర్శిస్తూ, అపహాస్యం చేస్తూ. అనుకరించటాన్ని 'పేరడీ'కి, రెడీ నిర్వచనంగా పేర్కొనవచ్చు. ఈ పేరడీకవి, వికటాను కరణలలో, తన వ్యక్తి త్వాన్ని కూడ విస్మరించి, సున్నిత హాస్యంతో, సుతిమెత్తని చురకలం టిస్తూ, చమత్కారంతో శబ్ద చిత్రాన్నిజోడిస్తూ, ప్రశ్నిస్తూ, ప్రత్యుత్తరిస్తూ, 'అన్యుల మనముల్ నొప్పింపక, తానొవ్వక, తప్పించు కొంటూనే, వెక్కిరిస్తూ, వికటాట్ట హాసంచేస్తాడు.

కేవలం 'అనుసరణ' గాని, 'అనుకరణ' గాని 'పేరడీ'గా పేర్కొ నబడదు. పద్యాలకు ప్రకటంగా, చమత్కార, శబ్ద చిత్రాలను జోడించి, చురకలంటించి, అపహాస్యం చేస్తూ అనుకరించటమే 'పేరడీ'గా పేరు పొందింది.

ఇట్టివి, పూర్వ కావ్యాలలో అంతగా, ఆపేర్లతో, కన్పడవు. ఇది ఆధునిక ప్రక్రియావిశేషంగదా! ఒకనాడు, కాళిదాసాది కవీశ్వరులను కూడ అనుకరించి, అపహాస్యం చేయటం, వెదకితే వెయ్యిగాకపోయినా, అల్పాంశాలలోనైనా, కొన్ని అవతరింపకపోవు, అట్టి, పేరడీప్రాయాలగు కొన్ని ఉదాహరణలను, పరిశీలించి, నిగ్గుతేల్చండి.

కాళిదాసు 'ఏకో హి దోషో గుణసన్నిపాతే నిమజ్జతి-' ఇందోః కిరణేష్వివాంకః" అనగా, మరొకకవి 'ఏకో హి దోషో గుణసన్నిపాతే నిమజ్జతీత్యేవ మభాణి యేన, నూనం న దృష్టం కవినా హి తేన-'దారిద్ర్య దోషో గుణరాశి నాశీ' అనెను. అనగా 'కుమారసంభవంలో' హిమవత్పర్వతం అనేక రత్నాలకు ఆకరం అగుటవలన, ఒక మంచు ఉనికి, పైకి 'దోషం'గా కన్పిస్తున్నా, దాని అందాన్ని తగ్గించలేదు. ఏలన– ఎన్నో మంచి గుణాలున్నప్పుడు, ఒక చిన్న దోషం దోషంగా, తప్పుగా, కన్పడదు. అనేక మంచి గుణాలున్న చంద్రునిలోని 'మచ్చ' మణగిపోవటంలేదా! అని అర్థాంతరన్యాసంతో సమర్థిస్తూ సమాధానం చెప్పాడు కాళిదాస కవీంద్రుడు. దాన్ని, ఒకకవి వ్యంగ్యంగా, వెక్కిరిస్తూ, ఇలా అపహాస్యం చేసినాడు.

'గుణ సమూహంలో ఒక దోషం గుణీభూతం (అప్రధానం) అవుతుందని, ఒక కవి చెప్పినాడు, కాని, అది సార్వకాలిక సత్యంకాదు. ఆ కవి సరిగా సమీక్షించలేదు ఏలన, అతనిలో ఎన్ని మంచిగుణాలున్నా, అతడు 'దరిద్రుడు' కావటంతో, అన్నిగుణాలు అణగిపోయి, ఆ దారిద్ర్యం గుణరాశిని నాశనం చేయుటలేదా! ('దారిద్ర్య దోషోగుణరాశి నాశీ')అని.

మరొకచోట 'కవికంఠాభరణ' కర్త క్షేమేంద్రుడు, ప్రారంభంలో అభ్యాసార్థులకనువుగా 'వాగర్థావివ సంపృక్తౌ....''కు బదులుగా 'వాణ్యర్థావివ సంపృక్తౌ....' ఇత్యాదిగా అనుకరణం చేయవచ్చని సెలవిచ్చాడు. వ్యాజనిందాస్తుతులతో వ్యాప్తాలైన కొన్ని పద్యాలు, చమత్కారాన్ని చెంగ

లిస్తూ, సుతిమెత్తగా చురకలు వేస్తున్నట్లున్న, 'పేరడీ కల్పా'లన్నీ, 'పేరడీ'లని పేర్కొనరానివే అవుతా యని కూడ గమనించాలి.

కొన్ని, ఆంధ్రోదాహరణలలోని అనుకరణాలను కూడ, అవధరించండి. రామభద్రకవి 'రామాభ్యుదయం'లోని, 'హా'యను, గాధినందన మఖారి-నిశాట మదాపహారి బా'హా'అను పద్యానికి, జగ్గకవి 'చంచరీకనిచయాంచితకుంచిత రోమధామ దే'హా'యను....,చంద్రలేఖావిలాప పద్యం. ఒక అనుకరణ. ఇట్లే పూర్వకవుల ప్రసిద్ధపద్యాలను, తర్వాతి కవులు కొందరు కించిద్భేదంతో అనుకరించారు.

'కమలాక్షు నర్చించు కరములు కరములు- శ్రీనాథు వర్ణించు జిహ్వ జిహ్వ....' అన్న 'పోతన'కు, 'న్యాయంబు తప్పని నరపతి-నర పతి, నరపతిపాలించు నాడునాడు...."పద్యం అనుకరణే అయినా, దీనిలో, ముక్తపదగ్రస్తం' మురువును కూడ మూర్కొనవచ్చు.

మానుషదానమాన బలమానిత ధర్మ రమామనోజ్ఞరే-ఖానుతిభూతి విత్తముల...." అను శ్రీనాథుని పద్యానికి, క్రింది పెద్దన పద్యం అనుకరణ. 'శ్రీ రుచిరత్వభూతిమతి జిత్వరతాకృతి శక్తి కాంతులన్—ధీరత సారభోగముల....ఇత్యాదులు. అట్లే. అందని మ్రానిపండు, కరియంటని కాముశరంబు, తేటిము—క్కంటని పువ్వు........" పద్యంకూడ, సంస్కృత శాకుంతలంలోని 'అనాఘ్రాతం పుష్పం,కిసలయ మలూనం కరరుహైః...." శ్లోకాన్ని గుర్తుకు తేవటం లేదా!

చాలామంది కవులు ప్రసిద్ధ"వేమన, సుమతి" శతకాలలోని పద్యాల ననుకరించారు.

"గంగిగోవుపాలు గంటెడైనను చాలు...." అన్న వేమన పద్యానికి

'పసముత్యమొకటి చాలును-గనవూడ్చిన చింపిరాలు గంపెండేలా? ...." అని.

"అడిగిన జీతం బియ్యని-మిడిమేలపు దొరనుగొల్చి మిడుకుటకంటెన్,
వడిగల ఎద్దుల గట్టుక—మడిదున్నుక బ్రతుకవచ్చు మహిలో సుమతీ!"
అను పద్యానికి
"కవితాలక్షణ మెరుగని-యవివేకికి పద్యమిచ్చి, యడుగుట కంటెన్,
చవిలెగాని, దండెగొనుకొని-భువిలో హరిదాసుడైన పుణ్యము దక్కున్"
అను సుమతిశతక పద్యానుకరణ, "కవితాగుణగణాలను, లక్షణాల నెరుగని, అరసికుడు అడిగినా, అతనికి కావ్య మంకిత మిచ్చుటకంటె, లోకములో హరిదాసుడై, రచ్చబండపై కూర్చుండి హరికథలు చెప్పుకొంటే పుణ్యమైనా దక్కుతుందని హెచ్చరిక.

....ఇత్యాదులన్నీ అనుకరణలై, సంవాదులుకావచ్చుకాని 'పేరడీ'లు మాత్రం కాజాలవు. 'వ్యాజనింద, రూపంలోనున్న క్రింది పద్యాలుకూడ 'పేరడీ'లు కావటం కష్టం. కాజాలవు.

గీ. ఆంధ్రలోకోపకారమ్ము నాచరింప-
భారతమ్మును నన్నయభట్టు తెలుగు
చేయుచున్నాడు సరియె, బడాయికాక,
'తొలుత సంస్కృత పద్యమెందులకు చెప్పుడి?"

గీ. అచ్చతెనుగు పదముల నిచ్చకోలది
పుచ్చి తలతిక్క అన్వయంబులను పెట్టి
పాడుచేసెను, నన్నయ్యభట్టు వారి,
ఉభయకవి మిత్రులన! తిక్కనయజ్వగారు!

సంచలనం కలిగించే, పై 'వేంకట రామకృష్ణ' కవుల పద్యాలకు ప్రత్యుత్తరాలేవి?

ఆ. శిలల లోన కల్గు జీవుని తెలియక
వాని నిశ్చలతయు వాని పరత

తెలియకిట్లు ప్రేమ తెలివియైనవెట సీకు?
విసయమెవుడు గల్గు వెర్రివేమ!

అంటూ, ఒక సనాతనుడు మానవతా, హేతువాదియగు వేమనను వెట్టిగా ప్రశ్నిస్తున్నాడు.

"అరయన్ శంతనుపుత్రుపై విదురుపై నక్రూరుపై కుబ్జపై....," అను ప్రసిద్ధ పద్యానికి, అబ్బూరి రామకృష్ణరావుగారి "ఉపమాపై వెన రట్టుపై ఇడిలిపై...." పేరడీ. మరొకరి "పెరపై, నావడపై, పకోడి పయిఁ,హ-ల్వాతుంటిపై...." పద్యం, వేరొక పేరడీ. పోతనగారి "లావొక్కింతయులేదు, ధైర్యము విలోలంబయ్యె........రావే ఈశ్వర! కావవే వరద! సంరక్షింపు భద్రాత్మకా!" పద్యంపై, ఒక విరహికవి "పూవిల్కాని సరోజ బాణముల సంభోజారిపై చాయలన్-భావం బెంతయు—డస్సె.... రావే మానిని! కావవే తరుణీ! సంరక్షించు చంద్రాననా!"—పేరడీ.

"అన్నా! తిరుమలరాయా! కన్నొక్కటి లేదుగాని, కంతుడుగావా" అను తె. రామకృష్ణ పద్యానికి

"అన్నా! చెన్నలరాయా! కన్నొక్కటి కలదు కాని కౌరవపతివే"—పేరడీ.

ఆధునికులలో 'జలరుక్ శాస్త్రి(శ్రీ జల సూత్రం రుక్మిణీనాథశాస్త్రి) మాచిరాజు దేవీప్రసాద్ మొదలగువారు 'పేరడీ' రచనలలో సిద్ధహస్తులు. వారి పేరడీలు, ఎంతోమంది, నాలుకలపై నాట్యమాడుతూ ఉంటాయి. ఈ పేరడీ శాస్త్రి సంస్కృత 'అనుష్టుప్పు' శ్లోకానికి తెలుగు పేరడీ-

ఒక కాని ఒకే కానీ-రెండు కానులు అర్ధణా !
మూడు కానులు ముక్కానీ - నాలుగుకానుల కణా!

వీరే, కవి సమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారిపై చెప్పినపేరడీ శా. "కించిత్ తిక్తకషాయ బాడబ రసక్షేపాతి రేకాతి వా-క్సంచార....
....సంచారించి, ప్రవల్లికా వృతికృతిన్ పాషాణ పాక ప్రభూ" అనే పద్యం.

అల్లే, శ్రీశ్రీ "సింధూరం రక్తచందనం.......కావాలోయ్ నవకవనానికి" అనే గీతానికీ, "మాగాయీ కంది పచ్చడీ-ఆవకాయా పెసరప్పడమూ....వైజాగ్‌లో కారా కిళ్ళీ-సాహానోయ్ 'సరదా పాట'కు" - అనేది మరొక పేరడీ మరియు "అప్పిచ్చువాడు వైద్యుడు—నెప్పుడు నెడ తెగక పారు నేరును ద్విజుడున్...." అన్న సుమతి శతక పద్యానికి, శ్రీశ్రీ క్రింది పద్య మొక పేరడీ.

ఎప్పుడు పడితే అప్పుడు-కప్పెడు కాఫీ నొసంగ గలిగిన సుజనుల్,
చొప్పడిన యూరనుండుము చొప్పడకున్నట్టి యూరు చొరకుము మువ్వా!

ఏ దేశ చరిత్ర చూసినా-ఏమున్నది గర్వకారణం ?
నరజాతి చరిత్ర సమస్తం-పరపీడన పరాయణత్వం....

అను శ్రీశ్రీ కవితకు,

"ఏకోస్తు చరిత్ర చూచినా-ఏమున్నది గర్వకారణం
రహదారీ చరిత్ర సమస్తం-యాతాయాత జన సంయుక్తం...."

అనేది మాచిరాజుగారి పేరడీ.

"తాజ్ మహల్ నిర్మాణానికి-రాళ్ళెత్తిన కూలీ లెవ్వరో?...."

అనే శ్రీశ్రీ కవితకు "పిక వాసి వ్రాసేటప్పుడు-తగలేసిన బీడీలెన్నో" అని పేరడీ శాస్త్రి పేరడీ.

మరికొన్ని వేమనాదుల పద్యాలకు సులభంగా అర్థమగు పేరడీ ప్రాయాలు, చాటు పద్యాలు.

ఆ. వేద విద్య నాటి వెలుగెల్ల నశియించె
గారె బూరె పప్పుకత్తెచారు మిగిలె,
బుద్ధి కరిగి కరిగి బొజ్జగా మారెరా! విశ్వదాభిరామ....

ఆ. కత్తి వదలి రాజు కామిని చేపట్టె
గంట మొదలి మంత్రి గరిటె పట్టె
వేసమునకు మిగిలె మీసాల దుబ్బులే- విశ్వదాభిరామ....

ఆ. పంచదారకంటె పరదార తీయన
రాజుకంటె మోజు రంకు మగడు
అయినదానికంటె కానిది మేలయా! - విశ్వదాభిరామ....

క. ఈ కాలంలో ఎవరికి
నోరుంటే వాడె రాజు, నూరుచు మిరియాల్
కారాలు తెగ బుకాయి
స్తే రాజ్యాలేలవచ్చు సిరి సిరి మువ్వా !

క. సీకొక సిగిరెట్టిస్తా-నాకొక శతకమ్ము వ్రాసి నయముగ విమ్మా!
త్రైకాల్య స్థాయిగనీ—శ్రీ కావ్యము వరలు నోయి సిరిసిరి భాయీ!
పున్నమి జాబిలి మోమని-అన్నుల మిన్నలను వోల్చు టనుచితమట,
నేడన్నీ రాకెట్లు రప్పలె—విన్నావా ముళ్ళపూడి వెంకట రమణా!

ఆ. చచ్చిపోయి జీవి ఎచ్చటి కేగునో -
ఏమి యగునొ ఎవరి కెరుగ రాదు
ఎరుకలేని వార కేమేమొ చెప్పగా
విని తపించువారు వేన వేలు ॥

ఆ. కథలు సెప్పికొన్న, కావ్యమ్ములు పఠించు
కొన్న, నవల చదివికొన్న, నాట
కముల నాడికొన్న, గతివేర లేమి, మా-
తలల, పీదు కృతులె తాల్ప వలసె !
('విశ్వనాథ'నుగూర్చి కాటూరి-వ్యాజనింద)

క. రుక్కానకు, ఆగ్రహముగల-ముక్కానకు,
విచిత్ర భావ ముఖరితవాణీ —
భాక్కానకున్, తెగవాగెడి-డొక్కానకున్,
సాటి లేని డుబుడుక్కానకున్ ॥

వి. ప్రాచీన ప్రబంధస్థ-షష్ఠ్యంత పద్యాలకు, ఇది రుక్కా శత
కములోని 'పేరడీ'-ఇట్లెన్నో గలవు.